మంత్రిగారు మీతో మనవి చేయుమన్నారు" ఆ పలుకులువిని రాణా "నిజమే యతని లోపములే" దని చక్కెర లేకయే భుజించి పోయెను.

సామంతరాజు లందరిలో సంగ్రాముడు కోటేరియో సంస్థాన ప్రభువుమీద నెంతయు ననురాగము గలిగియుండెను. రాణావద్ద నతని చనువులు మెండగుటచే నతడొకసారి దర్శనము చేసి యిట్లనియె. "స్వామీ: మన పూర్వులు ధరించినట్లె ప్రాత పక్కీగా దుస్తులు ధరించుచున్నారు. అవి యందముగనులేవు. చాలుటయునులేదు. ఆమాదిరి మార్చి పొడవు నిడివియుగల నంగీలు దొడిగికొనిన శీవియు సౌఖ్యము చేకూరును ముందుగా మీరు క్రొత్తమాదిరి దుస్తులు తొడుగుదురేని మేమందరము మీ మార్గము ననుసరింతుము. కావున నట్లు సేయవలయు" నని వేడుకొనుటయు రాణా వానిపలుకులు శ్రద్ధగ నాలకించి యట్లే చేయుదు పొమ్మని యానతిచ్చె. రాణా చేసిన వాగ్దానము విని యానాడు మొదలు మీవారు దర్బారులలోని సామంతులు తక్కిన దర్బారులలోని సామంతులట్లే పలువన్నెల దుస్తులు దాల్చి కులుకవచ్చునని నమ్మి యింటికిబోయిరి. పోయిన కొంతసేపటికి రాణావద్దనుండి యొక దూతవచ్చి "అయ్యా! మీ గ్రామముల రెంటిని రాణావారు కలుపుకొని" రని చెప్పి పోయెను. రాణా యట్టిపని చేయుటకు దన యొనరించిన నేర మేమయి యుండునాయని యా సామంతుడు తలపగులునట్లెంత విచారించినను వానికి బొడగట్టదయ్యె. కారణములేక రాణా పిచ్చికోపముతో నిట్టి పనులు చేయువాడు కాడని గ్రహించి తక్షణమే ప్రయాణమయి యాతడు కారణమును దెలిసికొనుటకు

రాణావారి సన్నిధికిబోయి "మహాప్రభూ! మీకింత యను గ్రహము తప్పుటకు నే నేమి నేరము చేసితిని సెలవిం" దని బ్రతిమాలెను. అప్పుడతనితో రాణా యిట్లనియె. "ఓయీ! నేరమేమియు జేయలేదు. నీ గ్రామములు మేము గలుపుకొనుటకు గారణమిది. నేను నా లెక్కలు శోధించి చూచుకొనగా నాకు వచ్చెడు ప్రతి రూపాయయు నేదో కర్చునిమిత్త మేర్పాటు చేయబడి యున్నదనియు ధనమేమియు నిలువలేదనియు దేలినది. నీవు చెప్పిన దుస్తులకు ధనము చాల వ్యయమగును. అవి కుట్టించుట మానుకొందమన్న నాకుం బరమాప్తుడవయిన నీవు చిన్నబుచ్చుకొందువు. నిన్ను చిన్నబుచ్చుట కిష్టములేదు. అప్పుచేసి దుస్తులు కుట్టించుకొనుట కిష్టములేదు. కావున క్రొత్తగా కుట్టించు దుస్తుల నిమిత్తము మాకు దగులు కర్చుల కొరకు మీ గ్రామముల గలుపుకొన దలంచితిమి" కోషేరియో ప్రభువు రాణా వాక్యముల నాలకించి నిష్కారణముగ గౌరవితో తల గోకికొంటినని విచారించి "దర్బారుదుస్తులు మార్చనక్కర లేదు మహాప్రభూ" యని యేలికను వేసుకొని యెన్నడటువంటి సలహాలు చెప్పగూడదని నోటికి బుద్ధి చెప్పుకొని రాజుచేత ననుగ్రహింపబడి యింటికిబోయెను.

సంగ్రాముడు క్రీ. శ. 1734 వ సంవత్సరమున మృతి నొందెను. అనంతరము మీవారు సింహాసనమును దుర్బలు లధిష్ఠించుటచే నది తొల్లింటి గౌరవము నిలుపుకొనలేక మహారాష్ట్రుల దండయాత్రల పాలయి క్రమక్రమముగ క్షీణదశకు వచ్చెను.

# అజితుని కొడుకుల కథ

మారువారు దేశప్రభువగు నజితుని గురించి యొక కథగలదు. అతడు ఛోహాణవంశజాతి యగు నొక రాజకన్యను వివాహమాడ దలచి పయనమై పోవుచుండ మార్గమధ్యమున వానికి రెండు సింగము లగపడియెనట. అందొకటి నిద్రించుచుండెనట. రెండవది మేల్కొనియుండెనట. ఆ శకునఫలమేమని యారాజు తనజ్యోతిష్కు నడుగగా నతడిట్లని చెప్పెనట. "రాజా! నీవు వివాహము కాబోవు కాంతవలన నీకిరువురు కొడుకులు పుట్టుదురు. అందొకడు మహాబాహుశాలియగు, రెండవవాడు నిదురపోతు. పనికిమాలినవాడునగు, ఇదియే శకునఫలము." ఆ సిద్ధాంతి యన్నట్లే యజితుని కిద్దరు కొడుకులుపుట్టిరి. పెద్దవాని పేరభయసింగు; రెండవవాని నామము భక్తసింగు. ఈ కనిష్ఠుడే తండ్రిని గడతేర్చిన పాపకర్ముడు. అజితుని ఘోర మరణమును విని జనులు హాహాకారములుచేసి యెంతో దుఃఖించిరి ఈ దారుణమరణము పాలైనందుకేగాక యజితుని కొరకు జనులు విచారింపవలసిన మేలుగుణము లతనియందు కొన్నియున్నవి. అజితుడు బలాఢ్యుడు కావున తనకును తండ్రికిని బరమశత్రువై మహాపకారములజేసిన యౌరంగజేబు మృతినొందినతోడనే వాని కొడుకులను బలుచిక్కులుపెట్టి కొంత దేశము వారివద్దనుండి సంగ్రహించెను. చిన్ననాడు తన్ను రక్షించిన దుర్గాదాసు విషయమున కృతఘ్ను డయ్యెనను కళంకముతప్ప వానియందు మరేలోపములేదు. అజితుని పట్టపుదేవులు సహగమనము చేయదలంచిరి. ఆపని చేయవలదని ఛోహాణ రాజపుత్రికను బలువురు వేడిరి. ఆమెయే తండ్రిని జంపిన భక్తసింగుతల్లి. ఎంతవేడిన నామె తనపని మానక

యిట్లనియె. నేను భర్త ప్రక్కను నిదురించుచుండ నిద్రలో పొడువబడిన యాయన దేహమునుండి ప్రవహించు క్రొన్నెత్తురులు నన్ను మేల్కొలిపెను. కన్నతండ్రియనక ప్రక్కను బవ్వళించిన తల్లిని నన్నైనన జూడక మా ముద్దుల బిడ్డడు భక్తుడే యీ యతిఘోరము చేసెను. అనుచుండ భక్తుడు చిన్న జాబొకటి వ్రాసి " నేనొక్కడన చంపలేదు, తండ్రిని జంపుమని మాయన్న నన్నుం బురికొల్పె. అతని స్వహస్తముతో వ్రాసిన యుత్తరమిదిగో చూడు " డని గుంపుగూడిన సామంతులమీద పారవైచెను. ఆ యుత్తరమును జూపినపిదప నారాణి " యీ కొడుకుల నమ్మికొనియా నన్ను బ్రతుకమనుచున్నారు? చాలు చాలు; నా కొడుకుల యింట నుంటకంటె నీమంట పాలగుటయే నాకెక్కువ సుఖ " మని పలికి సహగమనము చేసెను.

తండ్రిని జంపించి గద్దె యెక్కినాడనుమాట మరచితిమా, యభయసింగు మారువారు ప్రభువులలో నగ్రగణ్యుడని చెప్పవచ్చును; అతడు కదలక కదలక యొకసారి విజృంభించి లేచెనో శూరులను దలతన్నిన శూరుడై మెరయువాడు. ఆ కాలమున రాజస్థానమునం దంతట వానిం బోలిన విలుకాడు, పోటుమానిసి మరియొకడు లేడు. ఆ కారణమున నతనికి మిక్కిలి గర్వముగలదు. ఈ గర్వముచేత నే యతడొకసారి యొక గొప్ప ప్రమాదమును జేసెను. ఈతడు తన కుమార్తెను అంబరురాజు కచ్వావంశస్థుడునగు జయసింగునకిచ్చి వివాహము చేసెను. ఈ కచ్వావంశస్థులు తక్కిన రాజపుత్రులవలె యుద్ధమునందంత దండిమగలుగారు. అందు ముఖ్యముగా జయసింగు యుద్ధపరాఙ్ముఖుడై కత్తులమీదకంటె చదరంగపు పెత్తులమీద నెక్కువ యాసక్తిగలిగి కాలము పుచ్చుచుండును అందుచే నభయసింగు ఢిల్లీచక్రవర్తి సభలోనైననుసరే తనయల్లుని

బరిహాసముచేయుచు వచ్చె. ఒకనాడు చక్రవర్తియు గొందరు సామంతులు నల్లుడు గూర్చుండ నభయసింగు పరిహాసార్థకముగా జయసింగుతో "మిమ్ము లోకులు కచ్ఛ్వాలందురు; అది కచ్ఛ్వాగాదు. కస్వా: కస్వా యనగా గడ్డి; గడ్డిపోచ లెట్టిపోటుల బొడుచునో మీ కత్తులు నట్టిపోటులే పొడుచును."

ఈ యెగతాళి మాటలువిని జయసింగు మనసునం గ్రోధముబూని యదను వచ్చినప్పుడు మామగారిపై బగదీర్చుకొనదలంచెను. జయసింగు యుద్ధములలో గొప్పజోదు కాకపోయినను జగతురనెట్లో కడతేర్చి తన కార్యము చేసికొనుటలో గడుదిట్టరి. కాబట్టి మామపై గల యక్కసు దీర్చుకొనుట కతడు చక్రవర్తి కొలువులోనున్న యొక యుద్యోగస్థునితో గుట్రలు పన్ని యదను వెదకుచుండెను. అటులుండ నొకనాడు చక్రవర్తి కొలువులో మంత్రులు సామంతులు మొదలగువా రనేకులుండ జయసింగు నభయసింగుగూడ నక్కడకు వచ్చిరి. జయసింగుతో గలసి కుట్రలుపన్నిన యుద్యోగస్థు డభయసింగుయొక్క సామునేర్పులు బంటుతనము మొదలగునవి మిరిమీరినట్లు మెచ్చుకొనుచు జక్రవర్తి చెవులకు వినబడునట్లు పొగడ నారంభించెను.

ఆ పలుకులువిని చక్రవర్తి యభయసింగువంక జూచి "అన్నా, నీనేర్పును గురించి నేనును బలుమారు వినియున్నాడ" నని హెచ్చరింప నభయసింగు 'చిత్తము. దానికిం దగు సమయము వచ్చినపుడు నాప్రజ్ఞ కనబడు' నని యుత్తరము చెప్పెను. అప్పుడు జయసింగుని మిత్రుడగు నుద్యోగస్థుడు చక్రవర్తితో "ఇతడొక్క యేటున దున్నపోతు మెడ దెగవేయగలడట. ఎవరివా గెప్పుడైన నిది విన్నారా" యని యడుగ జక్రవర్తి "యోహో! యట్లయిన నాచిత్రము జూడవలసినదే.

సత్వరమే యొక దున్నపోతును దెప్పింపు" దని యాన తిచ్చెను. తోడనే యొక కారుదున్నపోతును సేవకులు దెచ్చి యెట్టయెదుట నిలిపిరి. అది రాదమునుపే యభయసింగు ఖడ్గమునుదూసి మెరపుదీగెలాగున ద్రిప్పుచు నట్టహాసము జేయు చుండ మంత్రి సామంత ప్రభృతులు చక్రవర్తియు వాని భుజా దర్పముజూడ నెంతయు నుబలాటపడిరి. నదగొండవంటి యా కారెనుమును సేవకులు గొనితేర దానింజూచిన తోడనే దుర్ని రీక్ష్యమయిన యభయసింగు మోము వెలవెలబోయెను.

ఆ యెనుబోతు సామాన్యపు టెనుబోతుకాదు. జయసింగు వాని మిత్రుడు గలసి యోచించి మిక్కిలి పొగరెక్కిన దున్నం దెప్పించి యది తెగబలిసిపోవువరకు మొలబోతు గట్టితో మేపిరి. చక్రవర్తి సమ్ముఖమున కదివచ్చునప్పటికి దాని మెడ ప్రపంచమునందే బలాఢ్యుడైన నెంతపదును కత్తితోనైన తానొక్కయేటుతో గాదుగదా నదియేటుల నయిన దెగవేయుటకు వీలులేనంత దిట్టముగ బలిసియుండెను. అందుచే దన్సక మామకు బరాభవము జరుగునని జయసింగు నిశ్చయించుకొని యుండెను. అభయసింగు దాని నొక్కసారి తేరిపారజూచి చక్రవర్తితో "నేనొకసారి నా గదిలోనికి బోవుటకు సెలవీయ వేడెద" నని యడుగ నతడు దాని కంగీకరించెను. అభయ సింగు గదిలోనికింజని వల్లమందు ముద్దదీసి సాధారణముగా దాను పుచ్చుకొను మోతాదుకన్న రెండురెట్లెక్కువ పుచ్చుకొని కన్నులు జ్యోతులవలె నెఱ్ఱబడ నుగ్రమూర్తియై యూవలకు వచ్చి చేరియున్న సభికుల నందరవంక నొకసారి కలియజూచి దానికంతకు గారకుడు తనయల్లుడే యని గ్రహించి రెప్పవాల్ప కాతని నొకనిముసము చూచి పిమ్మట చక్రవర్తివంక దన దృష్టులు నిగిడ్చెను. జయసింగు మామజూచిన చూపులలో గీడు

శంకించి చక్రవర్తి కిట్లనియె. "దేవా ! రాజపుత్రు లవమానము పడినప్పుడు మీదుమిక్కిలి నల్లమందు మద్దత్తు పుచ్చుకొన్నపుడు పిచ్చివారలయి యెదుట నెంతవారున్నను లెక్కసేయక పరాభవకారణులగు వారలపై బడుదురు. కావున మీ రిటనుండి తొలగిపొండు" అట్లు జయసింగు మాట్లాడుచుండగనే యభయసింగు పట్టాకత్తి రెండుచేతులం బట్టి బిరబిర ద్రిప్పుకొనుచు జంతువును డాకెను. సభాసదుల కన్నులు చీకట్లు గ్రమ్మెను. పిడుగువంటి చప్పుడు చెవులకు వినబడియె. క్రొన్నెత్తురులు నేలగారె. సభాసదులు కన్నులు దెరచి చూచునప్పటికి దున్నపోతుతల నేలబడియుండె. ఆ దెబ్బచే నలసి యభయసింగును జంతువుప్రక్కను నేలంబడియుండె. అందరు బహువిధంబుల నభయసింగు దోర్బలము గొనియాడిరి. జయసింగును వాని మిత్రుడు తమయక్కసు దీరలేదని లోలోన సిగ్గుపడవలసివచ్చె. కాని యీ దారుణ కర్మమును చూచినపిదప చక్రవర్తి జన్మమధ్యమున నెన్నడు వేడుకనిమిత్తము దున్నపోతుం జంపుమని వాని నడుగడయ్యె.

అభయసింగు దేశ మిరువదేండ్లు పరిపాలించెను. ఆ కాలములో నిరంతరమును వానికి దమ్ముడు దుఃఖకారణుడయ్యెను. భక్తుడు బలము సాహసముగల యోధు డగుటచే సోదరులకు విధేయుడై నెమ్మదిగ గాలము బుచ్చడయ్యె. అభయసింగు మీవారు ప్రభువైనతోడనే తమ్మునకు నాగూరు సంస్థానమిచ్చెను. ఆ సంస్థాన మనుభవించుచు సంతుష్టుడై యుండక భక్తసింగు తనయందు దనయన్నకు నమ్మిక లేదనియు నట్లగుటచే దనకత డెపుడైన నపకారము చేయవచ్చుననియు లేనిపోని యనుమానములు తెచ్చి పెట్టుకొని యన్నగారి కేవైన నిబ్బందులు గలుగజేసినపక్షమున దనజోలి కతడురాడని

నిశ్చయించి యిక్కడిమాట లక్కడ నక్కడిమాట లిక్కడ చెప్పి చుట్టుపట్ల రాజులతో సోదరునకు గలహములు గలిగించెను. ఇట్టికలహము వాని ప్రయత్నముచేత నొకసారి యంబర ప్రభువునకు నభయసింగునకు సంభవించెను. అభయసింగు దండెత్తిపోయి జయసింగు నగరములో నొకటియగు బికనీరు ముట్టడించెను. జయసింగా నగరమును విడిపింపబోయి సంపూర్ణముగ నోడిపోయెను. ఈ గెలుపువలన జననష్టమేకాని యభయసింగునకు గలిగిన లాభములేదు. జయసింగు పరాజయము నొందినను బినమానుగారగు భక్తునియొక్క దేవతార్చనపు పెట్టెను మెల్లగా సంగ్రహించుకొని తనయూరు తీసికొనిపోయి యందులోనున్న దేవునకు దన దేవతార్చన పెట్టెలోనున్న యమ్మవారిని వివాహముచేసి తన్నిమిత్తమున గొప్ప యుత్సవములుచేసి యనంతరమా విగ్రహమును మరల భక్తునకు బంపివేసెను. కావలయునని కలహము దెచ్చినందుకు భక్తునికే పరాభవము జరిగినదని యందరు సంతసించిరి. అభయసింగు తన యల్లునితో వచ్చిన విష్కారణ కలహములకు విచారించి, యెట్టకేలకు మీవారురాజుల ప్రేరణముచేత సంధి గావించుకొనియె.

ఈ యుద్ధము ముగిసిన కొంతకాలమునకు మరల తన తమ్ముడెవరితో గ్రొత్తకలహము దేకమునుపే యభయసింగు మృతినొందుటయు వానికొడుకగు రామసింగు సింహాసన మెక్కుటయు సంభవించెను. ఈ కుమారునకు బినతండ్రివలన జిక్కులు మొదట పట్టాభిషేకమునాడే కానబడియెను. పట్టాభిషేకమప్పుడు రహతూరుల రాజబంధువులలో ప్రధానపురుష డగుటచే భక్తుడు వచ్చి కానుకలు కట్నములు సమర్పించి యన్నకుమారునకు మొగమున టీకా స్వయముగ వేయవలసినది. అట్టిమర్యాద

లతిక్రమించి భక్తుడా సమయమున స్వయముగరాక తనకానుకలు తనవిన్నపములు క్రొత్తరాజాకు సమర్పించుటకు ముసలిదగు తనదాదినంపెను. రాజపుత్రులు తమ్ముపెంచిన దాదులను మిక్కిలి గౌరవముతో యావజ్జీవము రక్షింతురు. కొందరు రాజపుత్రులు రాజకీయ వ్యవహారములలోను గృహకృత్యములలోను తమ దాదుల మాటల కడుగుదాటక వర్తింతురు. ఎంత గౌరవమైన నంతఃపురములలో జరుగదగినదేగాని సభలలోనికి వారు రాజనదు. పినతండ్రికి బదులుగావచ్చిన యా ముసలిదాదిని జూచినతోడనే క్రొత్తరాజగు రామసింగునకు మహాగ్రహము పొడముటచే నతడిట్లనియె. "ఛీ! ఛీ! నీవు మరల విన్న బంపిన రాజువద్దకుబొమ్ము. పట్టాభిషేకపు సమయమున నా మొగమున టీకావేయుటకు తాను స్వయముగరాక తొక్కవలె నున్న తొంబదియేండ్ల తొత్తును బంపునా? నేను కోతి ననుకొని నాడా యేమి? మీరాజు పంపిన కానుకలు కట్నములు నాకక్కర లేదు. అతడు మామొద జేసిన యపరాధమునకు మేము మును పతనికి భరణము నిమిత్త మిచ్చిన నాగూరు సంస్థానమునం దర్థభాగము గ్రహింతుమని చెప్పుము."

ఇట్లు పరాభవము పడినదాది నాగూరునకుబోయి తన పెంపుడు బిడ్డయగు భక్తసింగుతో రామసింగన్న మాటలం దొకటియు మరచిపోక పూసగ్రుచ్చినట్లు చెప్పెను ఆ పలుకులు విని భక్తసింగు కోపముచే మిడిసిపడక శాంతుడై "యర్ధరాజ్య మెందుకు? కావలసినపక్షమున నాగూరు సంస్థానమంతయు మీకు నేనర్పించెద" నని మరల నొక రాయబారిని రామసింగు వద్దకు బుత్తెంచెను.

రామసింగు గద్దెయెక్కినది మొదలు గద్దరితనమునం బెచ్చుపెరిగి తనతండ్రి కాలోచనలుచెప్పు మంత్రులయు వృద్ధు

లయు హితోపదేశములు వినక నిరాకరించుటయేగాక మీదు మిక్కిలి యాలోచనలు చెప్పునప్పుడు వారిని వెక్కిరింప జొచ్చెను. హృదయమును హృదయముతోబాటు నోరును మంచివి గాకపోవుటచే నతనికి స్వల్పకాలములోనే రాజబంధువు లగు రహతూరులలో సగముకంటె నెక్కువమంది శత్రువులైరి. రహతూరు దొరలలో నగ్రగణ్యుడగు కునిరామనువానికి మొగ మున ముడుతలు మెండుగానుండుటచే రామసింగు వానికి గొండ ముచ్చని పేరుపెట్టెను. చంపావతి కులాగ్రణియు దనతండ్రికి మంత్రియునగు కుసూలుసింగు పొట్టిగ లావుగ నుండువాడు. రామసింగు వానికి బొంతకుక్కయని పేరుపెట్టెను.

రహతూరులతో పరిహాసమాడుట పాముతో జరలాట లాడుట. రాణా తన్ను పలుమారులు వెక్కిరించినపుడు కుసూలు సింగు చెప్పుచు వచ్చిన మాటయుత్తరములనుబట్టి వాని స్వభావ మును, రాణా తెలిసికొనవలసినదేకాని మందుడగుటచే రాణా తెలిసికొనలేకపోయెను. ఒకనాడు రాణా వెనుకటియట్ల పరిహాస మాడ కుసూలు వానికిట్లనియె, “ అవును నేను కుక్కనేకాని యీకుక్క సింగము నెదురించు కుక్క ” పాపము రాణారామ సింగు మదోన్మత్తుడై వానిమాటల యర్థమును గ్రహింపలేక పోయెను. మరియొకనాడు చంపావతి కులస్థుడగు కుసూలు సింగుతో గలసి రాణా పువ్వులతోటలో గూర్చుండి యొక చెట్టునుజూపి యా వృక్షము పేరేమని యడిగెను. “ ఇది చంప కము మీ సేనకు నే నెట్టి శిఖామణినో యీ తోటకిది యట్టి శిఖామణి ” యని యుత్తరమిచ్చెను. చంపావతి కులస్థునిపై రాణాకు మిక్కిలి కోపముండుటచే నతడది పట్టలేక తక్షణమే దీనిని పడగొట్టి నిర్మూలము చేయుడు. మావారులో చంపక

మను పేరుగలదేదియు నుండగూడదని యా వృక్షమును నాశనము చేసెను.

అదిమొదలు కుసూలుడు రాణా దర్శనమునకు బోవుట మానెను. అట్లుండ రామసింగు తన పట్టాభిషేక సమయమున బినతండ్రియగు భక్తుడు తనకు గావించిన యవమానమునకు బగదీర్చుకొనుటకై వానిపై దండువెడల నిశ్చయించెను. దేశమునకు బరమశత్రువులగు విదేశస్థు లనేకులుండగ వారి నందరవిడచి రాణా పినతండ్రిమీద యుద్ధమునకు బోవుట స్వకులక్షయ హేతువని కుసూలుసింగు విచారించి యట్టిపని చేయవద్దని రాణాకు హితోపదేశము చేయుటకు మనసులో నిష్టములేకయే యొకసారి కోటలోనికివచ్చెను. అతడు సభలో గూర్చున్నతోడనే రాణా వానింజూచి వెక్కిరించి పరిహాసపు వచనములాడి “నీ పిశాచరూపము నేను జూడలేను, కావున మీరు శ్రమపడి మాకు తరుచుగా దర్శన మీయనక్కరలేదు” అని చెప్పెను. ఆ పలుకులు చెవిని బడినతోడనే తోకద్రొక్కిన త్రాచువలె చివాలున పీఠమునుండిలేచి ఖడ్గము నొరలోనుండి యూడబెరికి ఝళిపించి “యీ ఖడ్గమును త్రిప్పినంత సుళువుగా మారువారు దేశమునంతను ద్రిప్పివేయగల రహతూరు రాచవాని నవమానించితివి జాగ్రత్త” యని మరి యేమియుం బలుకక సభామందిరము విడిచి యావలకు బోయెను.

అనోపుసంస్థాన ప్రభువగు కుసీరామునువాడు రాణా చేష్టలురోసి లేచి పోబోవుచుండ రాణా వానింజూచి “ఓ ముసలి కోతీ! వెళ్ళకురా” యని పరిహాసముగ పలికెను.” కోతిగంతులు వేయుట యారంభించినప్పుడు మీ రానందింపవచ్చు” నని ప్రత్యుత్తరముచెప్పి యతడు గొలువును విడిచిపోయెను. సభ విడిచి యా యభిమానధను లిద్దరు గలసి కొంచెమునే

పాలోచించి యా దినము మొదలు రాణాతో తమ కేవిధమైన సంబంధము నుండగూడదనియు భక్తసింగునే రాణాగా జేయ వలయుననియు నిశ్చయించుకొని నాగూరుకోటకు సైన్య సమేతులై పోయిరి. ఆ యిరువురతో వారివంటి ప్రధానపురుషుడే చేరి నాగూరునకు బోయెను. అతడు మారువారు రాజుల యాస్థాన కవీశ్వరుడు.

కుసూలుసింగు కునీరామసింగు మారువారుదేశపు సరి హద్దులుదాటి నాగూరునకు వచ్చుచున్నారని విని భక్తసింగు ఏదో గొప్ప కారణము లేక మారువారు రాజ్యమును మోయు స్తంభమువంటి శూరు లిద్దరు నొక్కమారు తనదెసకు రారని నమ్మి వారికి సగౌరవముగ నెదురు సన్నాహము జేయుటకు గుఱ్ఱమెక్కి బయలుదేరెను. అతడు వచ్చునప్పటికి వారిద్దరు నిదురించుచుండిరి సేవకులు తమ యజమానుల నిద్దరనుండి లేపుదుమని ప్రయత్నించినను వద్దనిచెప్పి భక్తుడు కుసూలు సింగు దేరాలోనికిబోయి యాతని పరుపుమీద గూర్చుండి యతడు తనంతట తాను లేచువరకు గనిపెట్టుకొని యుండెను.

తన గుడారములో కొంచెము సందడి జరుగుటచే కుసూలుడు మేలుకొంచి కనులు దెరవకయే హూక్కా దెమ్మని తన సేవకున కాజ్ఞాపించెను. సేవకుడు ప్రత్యుత్తర మేమియు నియ్యక కను తెరచినతోడనే యజమానునికి సంజ్ఞచే భక్త సింగును జూపెను. చూపుటయు దక్షణమ కుసూలుడు నిశ్చేష్టుడై మారుమాటేదియు నాడలేక భక్తసింగును దనయజమానునిగ నంగీకరింపవలసివచ్చెను. రాజపుత్రుల కోపము తాటియాకుల మంటవంటిది. దురాగ్రహవశులైన రాజపుత్రులు విద్రానంత రము భోజనాంతరము దమ కాగ్రహము తెప్పించినవారి ననుగ్ర హించుటగలదు. కుసూలుడు సుఖనిద్రజెంది కలతదేరిన మన

నుతో మేలుకాంచుటచే దనరాజు చేసిన తప్పులు మరచి వానిని క్షమియింపవలయునన్నను భక్తసింగు మిక్కిలి వినయముతో గూర్చుండుటచే నతనికి వీలులేకపోయెను. మొగమోటముచే నతడు భక్తసింగునకు విధేయుడు కావలసివచ్చె అందుచే నతడు పాన్పుమీదనుండి లేచి భక్తునకు నమస్కరించి "ఇదిగో నా శిరస్సు, ఇది యిప్పటినుండి మీది" యని పలికెను.

పాపము భక్తసింగు వారు వచ్చినదే చాలునని ముందుగా నంగీకరింపలేదు. తన యన్నకొడుకు బాల్యముచే వివేకహీనుడై యట్లు ప్రవర్తించి యుండవచ్చుననియు నిష్టమైనచో రాణాకు వారికి దాను సంధి జేయుదుననియు నందుకు సమ్మతింపవలయు ననియు వారి ననేకవిధముల బ్రతిమాలెను. ఆ రహతూరు శూరు లిద్దరు గార్యము మిగిలిపోవుటచే సంధి పొసగదని స్పష్టముగ జెప్పిరి. ఆ కవీశ్వరుడు మరల నెన్నడు మారువారునకు బోవనని ప్రమాణము చేసెను. దృఢనిశ్చయులైన వారిని చెందనాడుకొన రాదని వారి స్నేహముజేసి భక్తుడు మారువారులో బ్రధాన పురుషులగు నా ముప్వురను తన స్వాధీనము జేసికొనెను.

తనసేనలో బ్రధాన పురుషులు ముగ్గురు దాయాదితో జేరినారని విని రామసింగు కుపితుడై జహాలూరుకోట దన యధీనము చేయవలసినదని భక్తునకు వర్తమానముంపెను. భక్తుడు వానివలె కోపావిష్టుడుగాక వినయసంపత్తిగలిగి "నాకు నా యేలినవారితో యుద్ధముసేయుట కిష్టములేదు. మీరువచ్చి పుచ్చుకొనిన పక్షమున జహాలూరుకోట నిచ్చుటకే యాటంకము లే" దని ప్రత్యుత్తరమిచ్చెను. ఆ మాటలు సరకుసేయక రామసింగు భక్తుని వాని యనుచరులను నాశనముజేయ సంకల్పించుటచే జహాలూరుకోట యిచ్చెదనన్నను నాగూరుపై దండు విడిసెను. మారువారు దేశమంతయు నంతఃకలహములతోడ

నట్టుడికినట్లుడకజొచ్చెను. ఉభయసైన్యములకు గొన్ని చిన్న చిన్న పోరాటములు జరిగినమీదట మేర్తాయను గ్రామసమీప మున నొకగొప్ప యుద్ధము జరిగెను. రామసింగు సుసూలును గుర్రీరాముని బరిభవించినట్లే యనేక రాజపుత్రవీరుల నవమా నించుటచే పలువురు శూరులు వానిని విడిచి భక్తసింగుతో జేరిరి. అందుచే భక్తునిసేన గొప్పదిగ నుండెను. అయినను రామసింగు దేశ మేలుచున్న రాజగుటచే వాని పక్షమునగూడ ననేకులు చేరిరి వాక్పారుష్యములేక కొంచెము గౌరవమే పెద్దలయెడ నతడు చూపినయెడ నతనిసేనయే విస్తారముగ నుండియుండును. అతని స్వయంకృతాపరాధముననే సేన స్వల్పమగుటయు నాడు పరాభవమగుటయు సంభవించెను. రామసింగు యుద్ధమునకు వచ్చునప్పుడు తన భార్యలలో నొక్కతెను వెంటబెట్టుకొని వచ్చెను. ఆమె భూజదేశపురాజు కూతురు. భర్తకెంతో యుప యోగకారిణియై యుండెను. ఆమె తుపాకిలో మందు దట్టించు టయు సరిగా గురిజూచి తుపాకి పేల్చుటయు నేర్చెను. ఆ సేనలో నామెనుబోలు శూరు లరుదుగనుండిరి. అదియును గాక యామె జ్యోతిశ్శాస్త్రవేత్త. స్వప్నఫలములు శకునఫల ములు లెస్సగా నెరుంగును. అవియన్నియు నటుండ నామె పుట్టింటినుండి మెరియలవంటి యైదువేల సైనికుల రణమున దెచ్చి రాజునకు నిచ్చెను. యుద్ధము ప్రారంభమగునాడు రామ సింగు డేరామీద నొక మాలకాకి వ్రాలి కూయజొచ్చెను. ఆ కూత వినగానే తమకు దారుణ పరాజయము వినాశనము తప్పక కలుగుననియు నట్టి ప్రళయము నా దుశ్శకునము సూచించుచున్నదనియు నమ్మి సైనికు లుత్సాహమును విడిచి మొగములు వ్రేలవేసికొని యుండిరి. ఆ మాలకాకి కావు కావు మని రెండుసారులు కూసి మూడవసారి కూయబోవునప్పటికి

నేమూలనుండియో తుపాకిదెబ్బ వినబడెను. సైనికులదరిపడి యిదియేమని చూచునప్పటి కాకునపక్షి చచ్చి నేలబడియుండెను. అది జూచినతోడనే సైనికుల మొగములు మరల వికాసవంతము లయ్యెను. రామసింగు మహారాణా మ్రాను పట్టరాని బిట్టలుకచే బండ్లు పటపట గొరుకుచు "నీవల నేనుండగ సాహసించి నా దేరామీద తుపాకి పేల్చినవారెవ్వరు? ఆ దురాత్ము లెవరో తక్షణమె కనుగొనిరం" డని యాజ్ఞాపించెను అప్పుడు కొందరు లోలోన గొణుగుకొనిరి. కొందరు కళవళముపడిరి. కొందరు సందేహించి యిట్టట్టు దిరుగజొచ్చిరి. ఎట్టకేల కందరిలో ధైర్యవంతుడొకడు తెగించి రాణావద్దకుబోయి యీ తుపాకి రాణిగారు పేల్చినారని చెప్పెను. తన భార్యయే యాపని చేసిన దని వినినతోడనే రాణా కోపోన్మత్తుడై నోటికిరాని తిట్లుతిట్టి "తక్షణమే యామె నా రాజ్యమును విడిచి వచ్చినదారినే పుట్టి వింటికి బోవచ్చునని చెప్పు" మని వర్తమాన మంపెను.

ఆ వర్తమానము విని యాదేవి భయకంపితయై తన నేరము సైరింపుమని ప్రార్థనపూర్వకముగ వర్తమానమంపెను. అతడామె ప్రార్థనము నిరాకరించుటచే నొకసారి దర్శన మిమ్మని యాదేవి వేడెను. ఎంతో విశ్వప్రయత్నముమీద నత డామెకు గడసారి దర్శనమిచ్చెను. అపుడామె భర్త పాదము లపైబడి "యింతమాత్రమున దేవరవారి కింత కోపము గలుగు నని యెరుగక యీ దుశ్శకున భయమున సైనికులు వెలవెల బోవుటచే మీకు జయమును సేమమునుగోరి యట్లుచేసితి. కావున నీ తప్పుగాచి నన్ను రక్షింపవలయు" నని ప్రతి మాలెను. ఆమె వేడికోలు బూడిదబోసిన పన్నీరయ్యె. భార్యను జూచి రామసింగు "నా నోటిమాటకు తిరుగులేదు. ఇక్కడనుండి నీవు వెళ్ళవలసినదని నే నంటిని, నామాట చెల్లితీరవలయును.

నీవిటనుండి వెళ్ళితీరవలయు" నని యెంతో కఠినముగ జెప్పెను. తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళని వాదించుచున్న యామోట రాజుతో వాదించిన కార్యములేదని యాదేవి "సరే! నన్ను విడుచుట మీ రాజ్యలక్ష్మిని విడుచుటయే. ఇదిగో నే బోవుచున్నా" నని రాజసముఖమును విడిచి తండ్రి తన కరణముగ నిచ్చిన యైదువేల సైన్యమును వెంటబెట్టుకొని యావలకు బోయెను.

అనంతరము యుద్ధము రెండు దినములయ్యెను. గెలుపెవ్వరికిని సరిగ చేకూరదయ్యె. జోదులు చేతులు చేతులు గలయున ట్లొండొరులం జంపువరకు హోరాహోరీగా బోర జొచ్చిరి. ఆ రెన్నాళ్ళ యుద్ధముతో మూరువారు దేశమంతయు శూరజన శూన్యమయ్యెను. అన్న తమ్మునిమీద తమ్ముడన్న మీద గత్తిగట్టి యొండొరుల రక్తము ప్రవహింపజేసిరి కొన్ని రహతూరు వంశములు నిర్వంశములయ్యెను. సమరములయందు గడతేరిన చంపావతి కుంపావతి వంశస్థులగు ముసలిదొరలు మొదలుకొని బాలుడగు మెహత్రి ప్రభువువంకుగల రాజపుత్రులందరా దినమున మృతినొందిరి మెహత్రి ప్రభువప్పుడే వివాహము జేసికొనెను. వివాహ సంబంధమైన కాళ్ళ పారాణి యానవాళ్ళయిన పోకమునుపే పసుపుబట్టలు విడువకమునుపే యుత్తర జందెములు తీయకమునుపే హస్తకంకణములు విప్పకమునుపే భార్యను గలిసికొనకమునుపే మహారాణా రామసింగు వర్తమానమంపుటచే నా బాలుడు దేశానురాగము భార్యానురాగముకంటె నెక్కువగనెంచి యొక్కదినమైన నామెతో సుఖింపకయే యుద్ధమునకుబోయి యచ్చట మృతినొందెను. పాపమాతని భార్య వివాహవేషమును దీసివేసి వైధవ్యవేషమునుదాల్చి మగని శరీరము యుద్ధభూమిలో నుండిపోవుటచే

సహగమనము చేయుటకు వీలులేక యాతని తలపాగ తెప్పించు కొని ధరించి చిచ్చురికి మృతినొందెను.

ఈ యుద్ధము జరుగుచుండిన స్థలమునకు సమీపమున నొక కోనేటి గట్టున నొక మఠముండెను ఆ మఠములో మహాత్ము లగు సన్యాసు లనేకులు వసియించుచుండిరి ఉభయసైన్యములు జేరి యొండొరులమీద ఫిరంగిగుండ్లు విసరుకొనుచున్నప్పుడు సన్యాసులు తమకవి తగులునేమోయని ప్రాణభీతిని మఠము విడిచి పరుగెత్తిరి. ఫిరంగిగుండ్లు వడగండ్లవలె వాని సమీప మున బడుచున్నను లెక్కసేయక యా సన్యాసుల గురువు మాత్రము నిర్భయముగ నిశ్చలముగ నామఠములో గూర్చుం డెను. ఆతని స్థితివిని యుభయ సైన్యాధిపతులు, సురక్షితమగు వేరొక్క స్థానమునకు బొమ్మని వేడుకొనుచు వానికి వర్తమాన మంపిరి. అయ్యిరువుర ప్రార్థనలుగూడ నాముసలి సన్యాసి చెవినింబెట్టక యిట్లని ప్రత్యుత్తరమంపె. ఫిరంగి దెబ్బవలన చావవలసిన యోగమున్నపక్షమున నెక్కడికిబోయిన నాకది తగలక తప్పదు, నేను చావకతప్పదు. అట్లుగాక భగవంతుం డింక కొంతకాలము బ్రతికింపదలచిన పక్షమున నిచ్చటనున్నను నాకొక గుండుదెబ్బయైన తగలదు. కావున నేనిచ్చటనుండి కదలను. అంతగా నాకపాయము సంభవించునని మీరు భయ పడుదురేని మీ రెండుసేనలు దూరముగబోయి పోరాడుకొనుడు అప్పుడు సాయంకాలమగుచుండెను, అందుచేత నప్పటికి రెండు సేనలు యుద్ధముమాని మరునాడు వేరొకచోటికిబోయి కయ్య మారంభించిరి.

రెండవనాటి యుద్ధమున రామసింగు సంపూర్ణముగ నోడిపోయి మేర్తాయను పట్టణమునకు బారిపోయెను. కాని యా పట్టణము వానికి శరణ మీయగలపాటి సామర్థ్యము గలది

కాదు. పట్టణ మతివిశాల మగుటచేతను కోటగోడలు సరిలేక పోవుటచేతను వాని కక్కనుడండుట చాల కష్టమయ్యెను. అదియును పరమనిర్భాగ్యుడగు తమరాణా నిమిత్తము రణరంగమున మృతినొందిన శూరులుగాక దక్కిన రాజపుత్రు లందరు భక్తునియెడ మిక్కిలి పక్షపాతము గలిగియుండిరి. ఈ స్థితిగతులు చూచి రామసింగు రెండుజాముల రాత్రివేళ గొందరనుచరులను వెంటబెట్టుకొని మేర్తాపట్టణము విడిచి పారిపోయెను ఈ పనికిస్ఫూలిన పనికితోడుగ జయప్పసింధ్యాయను మహారాష్ట్ర ప్రభువుతో సంధిచేసికొని వాని శరణముఁ జొచ్చెను.

ఈనడుమ భక్తుడు విజయమునందు తిన్నగా మారువారు రాజధానియగు జోధుపురమునకుబోయి యచ్చట నెల్లరహ తూరులచే ననుజ్ఞాతుడయి పిత్రీయమగు సింహాసన మెక్కెను. పిమ్మట స్వల్పకాలముననే రామసింగు ప్రేరణమున మహారాష్ట్ర సేనలతో సింధ్యా మారువారుపై దండెత్తెను. అప్పుడు స్వదేశ సంరక్షణార్థము రాజపుత్రు లనేకులు భక్తుని కొలువులో సైనికులుగ జేరిరి. భక్తుని సేన గొప్పదగుటచే నేదైనలాభ మున్నపుడెకాని పోరుసేయని మహారాష్ట్రులు పోరాటమువలన గలుగు లాభములకంటె నష్టమెక్కుడగునని చల్లచల్లగ జారిరి.

భక్తుడు సద్గుణాఢ్యుడై యదివరకేలిన రాజుల నందరిని మరపించి చక్కగ బరిపాలించెను శూరుడు మహాబలశాలి యున్నతచిత్తుడు గంభీరాకారుడు మహోధాత ఖడ్గమెత్తి శత్రువుల నేయునప్పుడు కలమెత్తి పద్దెములు వ్రాయునప్పుడు సమాన చాతుర్యము గలవాడునై లోకవంద్యుండుగ రాజ్యముం బరిపాలించిన భక్తునిజూచి ప్రజలు సంతోషించి యింతమంచివాడు నిజముగ తండ్రిం జంపియుండునా యని సందేహించిరి.

బంధువులగు రహతూరులు సయితము భక్తునితల్లి మరణకాల మందు పితృవధచేసిన భక్తునిగూర్చి పలికిన శాపవచనములు గూడ మరచి యొకవేళ మహాపతివ్రతయగు నామె శాపము తగులునేని యికముందెవ్వరికో తగులునుగాని భక్తునకు గాదనుకొనిరి.

మహారాష్ట్రులు రాజస్థానముమీద దండెత్తుచుండుటచే భక్తుడు వారిని బారదోలదలచి తన సంస్థానమునకు వంబరు సంస్థానమునకు నడుమనున్న యజమీరువకుబోయి మహా శూరులను కచవాహులను శూరులను వెంటబెట్టుకొని మహారాష్ట్రులను దరిమివేయుటలో దనకు సహాయము చేయవలసినదని యంబరురాజగు నీశ్వరసింగునకు వర్తమానమంపెను. ఈశ్వర సింగుస్థితి ముందుకువెళ్ళిన గోయి వెనుకకువెళ్ళిన నూయి యను నట్లుండెను. ఈశ్వరసింగు గూతురును రామసింగు పెండ్లి యాడెను. అదియునుగాక రామసింగు రాజ్యభ్రష్టుడై భక్తుని మీదికి మహారాష్ట్రులను బురిగొల్పి తీసికొనివచ్చెను. మరియు మహారాష్ట్రులు మిక్కిలి చండశాసనులు. అందుచే నీశ్వరసింగు మహారాష్ట్రులతోనే కలసి యుండవలయునని తలంచెను. కాని భక్తుడు పొరుగువా డగుటచేతను తనకన్న బలవంతుడగుట చేతను తనునమ్మిన స్నేహితులగు కచ్వాహోలు సయితము రహతూరులమీద పనికిరాకపోవుటచేతను భక్తునితో విరోధ పడినచో తనకు క్షేమములేదని యేమిచేయుటకుం దోచక యీశ్వరసింగు భార్య నాలోచన చెప్పుమని యడిగెను. ఆమె యజితసింగుయొక్క మనుమరాలు, భక్తునకు మేనగోడలు. అయినను భక్తునియందు ద్వేషముబూనిన దగుటచేత వానినెటులైన గడతేర్చెదనని యామె ప్రతినబూనెను.

అనంతరము కొంతకాలమునకు భక్తుడు సైన్యసమేతుడై యంబరుమేవారు మార్వారురాజ్యముల సరిహద్దులో నుండగ నంబరు రాణియగు మేనగోడలు వానిం జూడవచ్చెను. ఆమె రాకచేత భక్తుడు పరమానందభరితుడై సర్వవిధముల నాదరించెను. ఆమె మేనమామనుజూచి తనభర్త విధేయుడనిచెప్పి యనేకాభరణములు విలువగల బట్టలు బహుమానమిచ్చెను. భక్తుడాపారితోషికముల నంగీకరించి యావస్త్రముల ధరించెను. మేనగోడలు బహుమానమిచ్చి వెళ్ళిపోయిన కొంతసేపటికి భక్తుడు శిబిరమునందు "మహారాజు చనిపోవుచున్నాడు చనిపోవుచున్నా" డని గొప్ప కళవళముపుట్టి యెల్లవారిని దుఃఖసముద్రములో ముంచెను.

మొదట వైద్యులాలక్షణములనుబట్టి యది జ్వరమనుకొని చికిత్సచేసిరి. కాని పిదప రాజపుత్రస్త్రీలు బట్టలకు విషము పూసి మనుష్యులను జంపు నేర్పునగడుజాణలగుటచే నది జ్ఞప్తికిరా నెల్లవారు నది విషప్రయోగమే యని గ్రహించిరి. భక్తుడు మాత్రము తక్కినవారివలె భయపడక నెప్పటియట్ల ధైర్యముగనుండి మందులిమ్మని వైద్యునడిగెను. వైద్యుడగు సుజా యారోగమునకు మందులేదనిచెప్ప భక్తుడు "ఏమయ్యా! నావద్ద మాన్యములు గొప్పజీతములు పుచ్చుకొని యనుభవించుటయేనా మీపని? సమయము వచ్చినప్పుడు మందు లీయలేకపోయినచో మీ పాండిత్య మెందుకు? కాల్పనా" యని యడిగెను.

అడిగినను వైద్యుడేమియుం బలుకక యూరకుండెను. మరియొక రాజయినపక్షమున నప్పుడే వానిబుఱ్ఱ తీయించును. భక్తుడు యోగ్యుడగుటచే నట్లుచేయలేదు. కాని నిష్ఠురోక్తులు పలికెను. వైద్యుడాపలుకులు విని యెట్లకేలకు తనసామర్థ్యము

జూపదలచి యొక గొయ్యి త్రవ్వించి దానినిండ నీరుపోయించి రాజు చూచుచుండ నొక వేరుముక్క యానీటిలో పారవేసెను. వేసినతోడనే యానీరు గడ్డగా బేరుకొనెను, ఎల్లవారి కదిజూపి యా వైద్యుడు "ఇది నాప్రజ్ఞ నామందుల ప్రభావము" మనుష్య యత్నములకు లోబడినచో నేచికిత్సయైన జేయగలను, ఇది మనుష్యయత్నమునకు మించినది.

జీవితాశ యించుకయు లేదని విని భక్తుడు మనోధైర్యమును విడువక మంత్రి సామంతుల నందర బిలిపించి బాలుడగు తన కుమారుని బిజీయనువాని వారి కప్పగించి వాని పక్షముండు నట్లందరిచేత ప్రమాణములు చేయించెను. అవసాన కాలము సమీపించుటచే బిదప బ్రాహ్మణులు వానికి ప్రాయశ్చిత్తాది కర్మలు చేయించి షోడశమహాదానముల బడసిరి. అనంతరము భక్తుడు మరణోన్ముఖుడై తల్లి శాపము దలచి వెనుక తానుచేసిన పితృద్రోహమునకు విచారించి తన యెముకలు మూరువారు దేశమున నుండనీయవద్దని చెప్పి మృతినొందెను. పోయినచోటనే వానిని దహనముచేసి యొక సమాధిగట్టిరి. అది మొన్నమొన్నటివరకు నుండెను. భక్తుని మరణముచేత వాని కుమారుడగు బిజీసింగు పెదతండ్రియగు రామసింగు రాజ్యమునకై కలహింపజొచ్చిరి. బిజీసింగు పిన్నవాడగుటచే మహారాష్ట్రులు మూరువారును లోబరుచుకొనుట కదేసందని మేర్తా పట్టణమును ముట్టడించిరి. బిజీసింగు సైన్యసమేతుడై యక్కడకు బోయెను.

అంతట మూడు దినములు ఘోర యుద్ధమయ్యెను. ఉభయసైన్యములు చాల నష్టపడెను. మహారాష్ట్రులు కొండల లోను జెట్లచాటున దాగి చాటుపోరున కలవడిన వారగుటచే బయలుమీద జరిగిన యా యుద్ధమున వారి కంతగా నుత్సా

హము కలుగలేదు. బిజీసింగు సైనికులు పొరబాటుపడి రామ సింగు 'సైనికులనుకొని తమసేనతో మొరియలవంటి వారిని తుత్తునియలుగ నరికిరి. దైవికమైన యీ నష్టము రాజపుత్ర సేనకు గలిగినను మహారాష్ట్రులు పారిపోవుటకే నిశ్చయించిరి. అది కనిపెట్టి జయము తనకు తప్పక చేకూరినదని బిజీసింగు సంతసించి తన గుడారములో రహస్యముగ దైవమును ప్రార్థన చేయుచుండెను అట్టి సమయమున నిశ్చితముగ బలముల యదృష్టములు మారిపోయెను. ఆపదలో నున్నప్పుడు రాజ పుత్రులు కుటిలోపాయములబన్ని తరచుగ జయము చేకొనుట ప్రసిద్ధమేగదా! రామసింగు పక్షమునందున్న యొక సేనాపతి సేవకు నొక్కని బిలిచి బిజీసింగు సేనాపతులలో నొకనివద్ద నొకమాట చెప్పుమని పంపెను. ఆ సేవకుడు వచ్చి చందము పెట్టి బిజీసింగు సేనలో మనుష్యునివలె నటించి "స్వామీ! మనమింక నేల యుద్ధము సేయవలయును. మన మహారాజుగారగు బిజీసింగు గారు ఫిరంగి దెబ్బతిని చనిపోయినారు. ఈ మాట మీ రెరుగరు కాబోలు "నని చెప్పెను.

అత డదినమ్మి యుద్ధముమానెను. ఆ వార్త యడవి చిచ్చువలె నంతట వ్యాపించుటయు మంచుచేసగి యెండకు మంచువలె రాజపుత్ర సేన యంతయు గరిగిపోయెను. ఇది నిజమా యబద్ధమాయని యెవ్వరు నరయరైరి. బిజీసింగును జూడరైరి. మహాశూరులగు కృష్ణనగరు మహారాజా బికనీరు మహారాజు మొదలగు రహతూరు లందరు తిరిగి చూడక ప్రాణములమీది ప్రీతిచే బరుగెత్తిరి, కొందరు రామసింగు దయను సంపాదింప బ్రయత్నించిరి.

ఫిరంగులన్నియు మహారాష్ట్రుల స్వాధీనమయ్యెను. సాయంకాల మగునప్పటికి యుద్ధభూమి నిర్జనమగుటయు బిజీసింగు సంపూర్ణముగ బరాజితుడై రహిన్‌సంస్థాన ప్రభువగు లాలసింగొక్కడు దనకు సహాయుడై వెంటరా ప్రాణము దక్కించుకొనుటకు నాగూరునకు పారిపోవ గడగెను. ఆ చీకటి రాత్రి కతిపయపరిచారకులతో నతడెట్టులో నెట్టుకొనిపోవుచుండ గుళ్లములలసి సరిగా నడువవయ్యె. అనుచరులు గాయములచే బీడితులై బరువులగు కవచములు మోయలేక సకలావస్థలు బడజొచ్చిరి. అట్లు కొంతదవ్వరిగిన పిదప నా చిమ్మచీకటిలో తాము దారి తప్పినట్లు రాజునకు దోడగట్టెను. పొడగట్టుటయు నతడు లాలుసింగును బిలిచి వెనుకకు దిరుగుమని చెప్పెను. లాలుసింగు మొదట సందేహించి కొంచెము గొణుగుకొని యెట్టకేలకు దానివలన భయములేదని ధైర్యముచెప్పి యిట్లనెను. "మనము మరియొకదారిని వచ్చుచున్నమాట నిజమేకాని యిది నాగూరునకు మిక్కిలి దూరమునలేదు. మనమిప్పుడు మా యూరికి సమీపముగ నున్నారము. ఏలాగో యింత దగ్గరకు రానేవచ్చితిమి గనుక నన్నొకసారి మా గ్రామము బోనిండు. నేను నా యాలుబిడ్డలను జూచి తిరిగివచ్చెద"

అని పలుకుటయు బిజీసింగు నిర్విణ్ణుడై లాలసింగు దారి తప్పించవలయుననియే తప్పించినాడనినమ్మి యైదుగురు నేనలతో నా యర్ధరాత్రమున నాగూరునకుబోవ రెండవదారి పట్టెను. అంత లాభపరాయణుడగు లాలసింగు తను నమ్మిన రాజు నేకాకినిజేసి తనయూరు జేరెను. బిజీసింగు రహిన్ పట్టణము దారివిడిచి నాగూరుమార్గ మనుసరించి రేయంతయు గుఱ్ఱములు తీసికొని పోగలిగినంత మేరపోయిరి. నాగూరు రెండామడ దూరముననుండగ వాని గుఱ్ఱముపడి చచ్చిపోయెను.

వెంటనే యతడొక పరిచారకుని గుఱ్ఱమెక్కి మిట్టమధ్యాహ్నమయినను సూర్యుడు తన కిరణములచేత నిప్పుల జెరగుచున్నను ఫలహారము చేయుటకైన నీరు ద్రావుటకైన గుఱ్ఱము దిగక పయనముచేసెను. ఆ గుఱ్ఱములు మనుష్యుల నొకవిధంగా మోయగలిగినను వారి కవచములను మాత్రము మోయజాలక బాధపడజొచ్చెను. వారు మరిమూడు మైళ్ళదూరమందున్న దేశవాలు గ్రామము జొచ్చునప్పటికి గుఱ్ఱము లడుగుతీసి యడుగు పెట్టలేక కుంటివయ్యెను. అందుచేత నాయారుగురు మనుష్యులు గుఱ్ఱములవిడిచి తామువిడిపోయి యెవరిదారిని వారు తోచిన చోటులకుబోయి తమతమ యదృష్టముల ప్రకారము బ్రతుకవలయునని నిశ్చయించుకొనిరి.

బిజీసింగు కవచమును రాజచిహ్నములను దూరముగ బారవైచి పేదవానివేషము వేసికొని దేశవాలు గ్రామముచుట్టు నిట్టటు దిరుగుచుండ రెండెడ్లబండివా డొకడు కనబడెను. ఆతడు వానితో సంభాషణలకుజొచ్చి "రేపుదయములోపున నన్ను నాగూరునకు దీసికొనిపోగలవా?" యని యడిగెను. అక్కడికి నాగూ రెనిమిదిక్రోసుల దూరముండుటచేతను రాత్రియంతయు బండి తోలవలసి యుండుటచేతను బండివాడు కొంచె మనుమానించెను. రాజు తన యాత్రముచేత నెటులైన దన్ను దీసికొని పొమ్మని యడిగి యైదురూపాయ లిచ్చెదని యాసపెట్టెను. బండివాడు బలవంతముమీద నెట్టెటో యంగీకరించి "నాకు క్రొత్తరాజగు రామసింగుగారి ముద్రయున్న రూపాయలే యివ్వవలయునుగాని బిజీసింగు ముద్రయున్న పాత రూపాయ లక్కరలే" దని చెప్పెను. సరేయని యారాజా బండియెక్కి బండివాని ప్రక్కను గూర్చుండి రెండవరాత్రి పయన మారంభించెను ఎడ్లెంత వేగముగ బోవుచున్నను వాని తొందరనుబట్టి

యవి మెల్లగా ప్రాకుచున్నట్లు బిజీసింగునకు దోచుటచే నతడు త్వరగా నాగూరు జేరవలయునని ఛోయి ఛోయి యని యెడ్లను త్వరపెట్టసాగెను. అందుచే బండివాడు మిక్కిలి కోపించి బిజీసింగును బలుమారు కసరి " నీ వెవ్వడవు ? నాగొడ్లను బ్రతుక నియ్యవా యేమి ? ఈ యెద్దులను దోలుటకన్న యుద్ధములోనికి బోయి బిజీసింగుగారి పక్షమునుండి పగవాండ్రను దోలరాదా ? నీ వైఖరిజూడ నిన్ను వెనుకనుండి యెవ్వరో తరుముకొని వచ్చుచున్నట్లు దోచుచున్నది. నీవెంత గొంతుక బ్రద్దలు చేసికొని యరచిననుసరే చచ్చినా నే నింతకంటె నెక్కువ వడిగా త్రోలను. ఇష్టమున్నయెడల గూర్చుండుము లేదా దిగి నడువు " మని కఠినముగ బలికెను.

ఆ పలుకులువిని రాజు " అవస్థాపూజ్యతేరామ " అను మాట జ్ఞప్తికి దెచ్చుకొని కాలానుసారముగ నడువక దప్పదని తలవంచుకొని మాటలాడక కూర్చుండెను. అక్కడికి నాగూరు క్రోసెడు దూరముండెను. అంతలో బల్లున తెల్లవారె, తెల్లవారినది మొదలుకొని బండివాడు వాని మొగమువంక పరీక్షపట్టి పలుమారులు చూడజొచ్చెను. చూచిచూచి యుద్ధములో నలిగి రెండుదినముల నిరంతర ప్రయాణముచే డస్సి త్రొట్రుపాటుతో మారువేషము వేసికొని సర్వవిధములచేత తేజోహీనుడై యున్నను బండిలో గూర్చున్నవాడు తనరాజని గుర్తెరింగి యా బండివాడు బండిమీదనుంచి దిగ్గున క్రిందకురికి రేని కాళ్ళమీద బడి తన్ను క్షమింపుమని పరిపరివిధముల బ్రార్థించి " నే నేలిన వారితో సమానముగా కూర్చుండి సామాన్యునితో మాటలాడి నట్లు దేవరవారితో మాటలాడితిని. నన్నేమిచేసినను బాప మున్నదా ? " యని విచారించెను.

అతని దైన్యమునుజూచి జాలినొంది "మన కిప్పుడు మరియాదలతో బనిలేదు; నిన్ను నేను క్షమియించితిని. భయములేదు, బండెక్కి తోలు" మని యాజ్ఞయిచ్చెను. ఇచ్చినను వాడు ధైర్యములేక "స్వామీ! నేనంత చనువునకు దగను. నేనేమి? యేలినవారితో సమముగా గూర్చుండి బండి తోలుటేమి! నడచుచు దోలెద" నని పలుక రాజు వానిం బల వంతపెట్టి బండి యెక్కించెను. వాడు బండియెక్కి తనవద్ద నున్న బిరుసు పిండిరొట్టెలు పెరుగు మొదలగు పదార్థములు రాజునకుబెట్టి యాకటిదీర్చి భోజుభోజు యని యెడ్లను తానే త్వరపెట్టి సత్వరముగ బండి నాగూరునకు జేర్చెను.

గ్రామముజేరి బిజీసింగు బండివానికై దుర్యాపాయలిచ్చి తనకు రాజ్యము ప్రాప్తించినప్పుడు మాన్యము లిచ్చెదనని వాగ్దానముచేసి వాని నంపెను. పిమ్మట కొన్నినాళ్లకు బండి వానికి భూములుకూడ నీయబడెను. బిజీసింగునకు త్రోవలో నిచ్చిన రొట్టెలవంటి రొట్టెలు పెరుగువంటి పెరుగు ప్రతి సంవత్సరము బండివాని పద్దనుంచియు వాని వంశస్థుల వద్ద నుండియు బుచ్చుకొనుచు బిజీ సంతతివా రామర్యాదలం జరిపిరి. అవి నేటికిని బండివాని వంశస్థులకు జరుగుచున్నవి.

మహారాష్ట్రులతో జరిగిన యుద్ధమునందు హతశేషులగు రాజపుత్రులువచ్చి నానాటికి నాగూరులో బిజీసింగును కలిసి కొనిరి. అంతట శత్రువులు నాగూరుకోట ముట్టడింప రాజపుత్రు లారు మాసములు కోట గాపాడుకొనిరి. ఈనడుమ మారు వారులోనున్న కోటలు పట్టణములు క్రమక్రమముగ మహా రాష్ట్రుల సహాయమొందిన రామసింగుచేతిలో బడజొచ్చెను. అందుచే బిజీసింగు బైటనుండి తనకు దగిన సహాయము వచ్చినంగాని తనకు సేమములేదని గ్రహించెను. నాగూరు

కోటలో నతనితో నైదువందల లొట్టిపిట్టలుండెను. బిజీసింగు తన్ను ముట్టడించుచున్న మహారాష్ట్ర లేమరుపాటుననుండ నొక్కనాడు చక్కని యుపాయముపన్ని యొక్కొక్క లొట్టి పిట్టమీద నిద్దరు రహస్యతూరులను గూర్చుండబెట్టి కోట వెలువడి శత్రువులపైబడి సురుమాడి యెనిమిది జాములలోపుగనే తన చిన్నసైన్యములతో బికనీరుపట్టణము జేరెను.

బికనీరు ప్రభువు బిజీసింగు పక్షముననుండి కొంతసేపు పోరాడి తనయేలిక మృతినొందినాడన్న యపవార్తవిని ముందుగా పారిపోయెను. రాజ్యభ్రష్టుడైన బిజీసింగునకు మరల సహాయముచేయుట కిష్టములేక యతడు వానిని నిరసించెను. అట్లు భగ్నమనోరథుడయ్యు బిజీసింగు ధైర్యమును విడువక మరల నొకదినము ప్రయాణముచేసి జయపురమునకుజని తన తండ్రిని జంపించిన యీశ్వరసింగును సహాయ మడిగెను. తనకు మిత్రుడై తనపక్షమున బోరాడిన బికనీరు రాజుకంటె ప్రాతపగతుడైన యీశ్వరసింగే మంచివాడయ్యెనని యతనికి దోచెను. ఆరాజు సన్మానపూర్వకముగా బిజీసింగును గోటలో బ్రవేశపెట్టుటయేగాక కొలదికాలముననే స్వయముగా వాని దర్శనము చేయుటకుబోయి వానిని మిక్కిలి గౌరవించి ప్రేమతో నాలింగనము చేసికొని వానితో సమానముగా బ్రక్కను గూర్చుండి కుశలప్రశ్నము లడిగెను.

అక్కడకు బిజీసింగుతోగూడ నొక రహతూరు శూరుడు వచ్చెను. అతనిపేరు జోవానుసింగు, అతడు బిజీకి నమ్మినబంటై యతని ప్రాణమునకు దనప్రాణ మడ్డమువేసి కంటికి రెప్ప యట్లతోడై యెల్లప్పుడు వాని కుడిప్రక్కనే యుండును. ఆదినమునమాత్ర మతడెందుచేతనో తన యజమానుని కుడి ప్రక్కనుండక ప్రక్కన గూర్చున్న ఈశ్వరసింగు సంగరకాల

కొంగులమీద గూర్చుండెను. అట్లు 'చేయుటకు గారణమేమో అని బిజీసింగును యోచించుచుండెను. అతనింజూచి ఈశ్వరసింగు మిక్కిలి యక్కజపడి "ఏమోయీ! నీవీ దినమున మీరాజు వెనుకప్రక్కను గూర్చుండుటకు గారణమే" మని యడిగెను. "ఈవేళ నట్లు చేయవలసి వచ్చిన" దని జోవానుసింగు ప్రత్యుత్తరముచెప్పి తన రాజువంక దిరిగి "తక్షణమే లెండు, లేచి యావలకుబొండు, పోవరేని మరణమో చెరసాలయో తప్ప" దని బిగ్గరగ హితోపదేశము చేసెను. బిజీసింగు కచ్చివాహుల దుస్స్వభావ మెరిగినవాడగుటచే తన బంటు చెప్పిన మాట తప్పక తక్షణమే యటనుండిపోయెను. ఈశ్వరసింగు బిజీసింగును సాగనంపుటకు లేవ ప్రయత్నించెను. కాని లేవలేకపోయెను. ఏలయన జోవానుసింగు వాని యంగరకాల కొంగుల మీద గూర్చుండి కదలకపోవుటయేగాక విశేషించి తన కైజారు వాని మెడకు సూటిగబెట్టి హెచ్చు తగ్గు వచ్చినచో బొడుప నిశ్చయించుకొని దాటిపోవుచున్న రాజుతో "మీరు లొట్టియ నెక్కగానే నాకు వర్తమాన మంపు" డని కేకవేసి చెప్పెను. ఈశ్వరసింగు చుట్టములగు కచ్చవాహాదొరలు తెల్లబోయి చూడ సాగిరి. తనరాజు లొట్టియ నెక్కువరకు జోవాను డదేవిధముగ నుండి కచ్చవాహుల నందర గడగడ వడంకునట్లుజేసి చెక్కు చెదరక లేచి యీశ్వరసింగునకు సలాముచేసి తనకు సెలవిమ్మని యడిగెను. ఈశ్వరసింగు తన మనోరథము భగ్నమైనదనియు జోవాను తన్ను పరాభవించెననియు సిగ్గుపడి మరల సలాముచేసి పంపెను. అంతట రహతూరు లందరు నొంటెలనెక్కి సాగిపోయిరి. అప్పుడీశ్వరసింగు తన సరదారుల "చూచితిరా వాని విశ్వాసము! రాజభక్తి యెట్లున్నదో? అట్టి తూరులుండగ నా రాజు నెవడు గెలువగల" డని పలుకుచు లోనికిబోయెను.

జోవానుసింగు పైవిధముగా చేయుటకు గారణమిది. జోవాను సింగు మామగా రీశ్వరసింగు సేనాధిపతులలో నొకడు. ఈశ్వర సింగు బిజీసింగునకు ద్రోహము దలంచినాడని తన మామలవలన విని జోవాను డావిధమున జేసెను. బిజీసింగు మరల పయనమై నాగూరునకు బోయి యనాయాసముగ గోటలో బ్రవేశించెను.

అనంతర మతడు తన జీవితకాలములో దనకు రాజ్య ప్రాప్తి కలుగునను నాసవిడిచియుండ నారుమాసములు గడచిన తరువాత నొకనాడు వానియొద్ద కొక రాజపుత్రుడు నొక మహారాష్ట్రీయుడు వచ్చి జోహారుచేసి పలిచి: 'స్వామీ: మా కుటుంబములను మీరు పోషించుటకు వాగ్దానము చేయుదురేని మీ పరమశత్రువు నొక్కనిని మేము గడతేర్పగలము. అతడు కడతేరినపిదప నంతయు చక్కబడునని బలికిరి. బిజీసింగునకు బరమశత్రువు లిరువురు మహారాష్ట్ర సేనాపతియగు జయప్ప సింధ్యా యొకడు: పెదతండ్రియగు రామసింగొకడు. ఈ యిద్ద రిలో నెవడు గడతేరినను వానికి మంచిదే కాబట్టి యతడు వారు చేసిన ప్రతిజ్ఞ నంగీకరించెను.

ఒకనాడు జయప్పసింధ్యా దంతధావనము చేసికొనుచు డేరా గుమ్మమువద్ద గూర్చుండ సైనికులకు సరకులమ్ము వర్తకు లిద్దరు లెక్కల పుస్తకములు ముందువేసికొని నీదితప్పు నీది తప్పని బిట్టుగ గలహించి తమతగవు దీర్చుమని జయప్పను వేడుకొందమని యొకరి యొకరు మాండ్ర నొకరు బూతులు తిట్టుచు చేతులుబారలు జాపుకొనుచు నొండొరుల వెక్కిరించుకొనుచు మీదమీదికి బోవుచు గ్రమక్రమముగా జయప్ప సమీపమునకు బోయిరి. అప్పుడాకస్మికముగా రెండుకత్తులు తళతళ మెరసెను. మెరసినతోడనే 'ఇది నాగూరుపోటు' 'ఇది జాడుపూరుపోటు' టని పలుకుచు నిరువురు రెండుకత్తుల జయప్పను రెండుపోటులు

పొడిచిరి. జయప్పయు వెంటనే బీనుగయై దేరా గుమ్మమువద్ద పడెను. పడుటయు శిబిరములో గొప్ప కళవళము పుట్టెను. ఆ త్రొక్కుపాటులో జయప్ప సైనికులు తమ యేలికను జంపిన యిరువురలో నొకని దుత్తునియలుగ నరికిరి, రెండవవాడగు రాజపుత్రుడా సైనికుల చాటునబడి చల్లచల్లగ నావలకు దాటి నాగూరునకుబోయి శుభవార్త బిజీసింగునకు విన్నవించెను.

రాజపుత్రుడు మహమ్మదీయుడు బిజీసింగుతో చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనిరి. మహారాష్ట్రు లదివరకే యుద్ధములు చేసిచేసి విసిగి యుండుటచేతను, నాయకుడు సంహరింపబడుట చేతను సంధి కొప్పుకొనిరి, బిజీసింగు కొంతకప్పము నజమీరు దేశము మహారాష్ట్రులకిచ్చి సంధి చేసికొని తాను మారువారునకు రాజయ్యెను. లంచగొండులగు నా మహారాష్ట్రులు రామసింగు పక్షమున విడిచి బిజీసింగును రాజునుచేసి స్వదేశమునకు బోయిరి. రామసింగు రాజ్యము సంపాదించుట కిరువది రెండు యుద్ధములుచేసి జయము నందలేక క్రీ. శ. 1773 సంవత్సరము నందు రాజస్థానమందలి జయపూర నగరమున మృతినొందెను. బిజీసింగు సింహాసనమెక్కి యెడతెగని యుద్ధములు చేసిచేసి ముప్పదియొక్క సంవత్సరములు మారువారు దేశమును పాలించి 1794 వ సంవత్సరమున గాలధర్మము నొందెను.

## కృష్ణకుమారి

పదునెనిమిదవ శతాబ్దాంతమందు హిందూదేశమంతయు మిక్కిలి దురవస్థలోనుండెను. ఔరంగజీబు మృతినొందిన తోడనే వాని సంతతి మొగలాయీలు దుర్బలులై స్త్రీలోలురై మద్యపాన మత్తులై రాజ్యము మంత్రులచేతి కప్పగించి దేశమునకు దమకు నాశనమును దెచ్చుకొనిరి. వారి దౌర్బల్యముం గనిపెట్టి మహా

రాష్ట్రులు మరింత విజృంభించి ఢిల్లీ రాజ్యమునందలి భాగముల నూడబెరికి బంచుకొని దేశమున కెంతయు క్షోభగలిగింప జొచ్చిరి. ఒక్కప్రక్క సీకులు తలయెత్తి రాజ్యము స్థాపింప జొచ్చిరి. మరియొకప్రక్క నింగ్లీషువారు ప్రెంచివారు దేశాక్రమణ మారంభించిరి. దక్షిణమునుండి మహారాష్ట్రులు నిర్నిద్రప్రతాపులై దేశమును మంగలములో బెట్టి వేచినట్లు తపింపజేసిరి. నవాబులు రాజులు తమలో తామైకమత్యములేక కయ్యములకు గాలుద్రువ్వుచు కారణములేకయే పోరుచు దేశమును రక్తభూయిష్టము జేసిరి. దేశమందు వ్యాధులు కంటకములు మెండయ్యెను. స్థిరముగా నొకరాజొక దేశమును గొంతకాలము పరిపాలించుననుమాట నిశ్చయములేమి, ఈ యాపదలకుదోడు పారసీకమునుండియు కాబూలునుండియు మహమ్మదీయులు దండువెడలి దేశములం గొల్లగొని స్త్రీలం జెరబెట్టి యెల్లయెడల నాశనదేవతను నెలకొలిపిరి. ఆ కాలమున హిందూదేశమంతలో రాజస్థాన మనుభవించిన కష్టము లెవ్వరనుభవింపలేదు. రాజపుత్రులు తొంటివలె దమ కులగౌరవమును దేశగౌరవమును నిలుపుటకు బాటుపడక యంతఃకలహములు పెంచుకొని పోరుచు దమ సహాయార్థము మహారాష్ట్రులను పిలుచుచు వారిచే నెడదెగని బాధలం బడజొచ్చిరి. ముందు ముఖ్యముగ మీవారు సంస్థానము పడినపాట్లు చెప్పనలవిగాదు.

పదునెనిమిదవ శతాబ్దాంతమందు భీమసింగను నతడు రమారమి యెనిమిదేండ్ల ప్రాయమున మీవారు సింహాసన మెక్కెను. అతని యుక్తవయస్సు వచ్చువరకు వానితల్లి రాజ్యపాలనమును జేయుటకై పూని వయస్సువచ్చిన వెనుకగూడ వానికి రాజ్యమీయక తానే యధికారము చెల్లింపజొచ్చెను. అతడప్రయోజకులలో మొదటివాడు, మిక్కిలి దుర్బలుడు. వానికి

జగన్మోహనాకారియగు కృష్ణకుమారియను కూతురు గలదు. ఆ బాలికయే సంస్థానమునకు వచ్చిన మహాపత్తు మహాద్భుతముగా నివారించెను. ఆ భీమసింగు మీవారు నలువది సంవత్సరములు పాలించెను. అంతకాలము రాజ్యము దురవస్థలోనే యుండెను. తల్లియధికార మెట్టెటో యతడు వదలించుకొని యీవలబడ మంత్రులు వానిని మోసపుచ్చి తమ యాధీనము జేసికొనిరి. దేశము వెలుపల మహారాష్ట్రులు మహమ్మదీయులు కారుచిచ్చులట్లు జనులను బాదింపుచుండిరి. దేశములోపల రెండు రాజపుత్ర కుటుంబములు మంత్రిత్వము వహించి రాజుపేర నధికారము చేయుటకు దమలోతాము కలహించిరి. వీరు చందావతులు సూక్తావతులు. పూర్వము వీరిరువురు యుద్ధములలో నొండొరులను మించి పౌరుషముజూప బ్రయత్నింపుచు వచ్చిరి. కాని యిప్పుడు బుద్ధిలేని రాణాను బుట్టలోబెట్టి దేశమేలుటకు గలహించిరి. మొట్టమొదట చందావతు వంశస్థులే గెలుపుం గైకొనిరి. కాని వారు గర్వితులై యెవరిని సరకుగొనక యందర నవమానించుచుండ రాజమాత కలహించి యధికారము గైకొమ్మని సూక్తావతులం బురికొల్పెను. అది మొదలు మీవారు దేశము పడినపాట్లు పక్కలు నక్కలు సహితము బడియుండవు. ఆ సంగతులు నిద్దురలో జ్ఞప్తికి వచ్చినను భయము పుట్టకపోదు.

చందావతులు నాయకుడు సూక్తావతుల నాయకుని నిష్కారణముగా నధర్మముగజంపి వాని క్రొన్నెత్తురుతో దడిసిన చేతులతోనే రాణావద్దకుబోయి బీరములు కొట్టెను. అందుచే నా రెండు తెగలవారు విధివిరామములులేక పోరు సల్పుచు నొండొరుల మగవానిం జంపుచు గెల్చినవారు దేశమున నధికారులమని బయలుదేరి కప్పములిమ్మని ప్రజలం బీడించుచు రాక్షసకృత్యములు చేయసాగిరి. యీ యంతః కలహమును

సహింపలేక దుర్బలుడగు రాణాభీమసింగు విధిలేక తనకు సాయము చేయుమని సింధ్యాను గోరెను. యీ కోరుట కొరవితో దలగోకికొనుటయే యయ్యెను. మహారాష్ట్రులు మిడుతలదండు వలె వచ్చిపడి రాణాకు సహాయము చేయుదుమని వంకబెట్టి యకార్యములనెల్ల జేయజొచ్చిరి. సందావతులలో నొకడు సింధ్యావల్ల లంచము గ్రహించి చిత్తూరు పట్టణము వాని యధీనం చేసెను. అది స్వాధీనం జేసికొని సింధ్యా గార్యాంతరములమీద పునహా నగరమునకు బోయెను. పోవునప్పుడు దుష్టశీలుడగు సంబాజీయను మంత్రిని రాజస్థాన వ్యవహారముల చక్కబెట్టుటకై నియమించెను. వాడెనిమిదేండ్లు మీవారును నధికారము చేసెను. వాడెంత దుర్నీతిపరుడైనను రాణాపట్ల మంచివాడై మొండి వాండ్ర ననేకుల నడచి వారి యధీనములో నుండిన రాణా కప్పగించెను. అంతలో నతనికి మరియొక గొప్ప యుద్యోగము కాగా నతనికన్న నధమాధములు కొందరు మీవారునం దధికారము చేయుటకు వచ్చిరి. వారు వచ్చిన వెనుక ప్రజ లనుభవించిన దుఃఖము నెవ డనుభవింపగలడు?

అంతలో సింధ్యా మృతినొందెను. అతని వారసులు తమలోదాము కలహించి రాజపుత్రుల బంధముల నెక్కువజేసిరి. ఆ వారసులలో నెట్టకేల కెవడో యొకడు సింధ్యా యయ్యెను. అతడు మీవారు సంస్థానము తనకు సామంత సంస్థానమని యెంచి తనసేన గొంత నక్కడ నిలువజేసి వాని ఖర్చులు రాణా నిచ్చుకొమ్మనెను. ఎడనెడ సింధ్యాకు మరియొక మహారాష్ట్ర ప్రభువగు హోల్కారునకు వివాదములు, వాటితో యుద్ధములు సంభవించెను. ఆ యుద్ధములలో హోల్కారు గెల్చినప్పుడు హోల్కారు, సింధ్యా గెల్చినప్పుడు సింధ్యా మీవారునకువచ్చి తామే యధిపతులమని లక్షలకొలది ధనము కప్పమిమ్మని

రాణాను బీడించుచు వచ్చిరి. రాణాచే జిక్కిన ధనమంతయు నిచ్చి మహారాష్ట్రుల యాశ యెంతకు దీరకపోవుటచే నెట్టకేలకు నంతఃపురస్త్రీల నగలను వారి విలువగల వస్త్రములను సయిత మమ్మి యా దురాత్ముల ధనదాహము తీర్పవలసి వచ్చెను.

దేశ మాస్థితిలోనుండ రాణాభీమసింగు కూతురగు కృష్ణ కుమారి యుక్త వయస్కురాలయ్యెను. ఆమె కప్పటికి పదు నైదవయేడు. ఆ ముఖలావణ్యము, ఆ శరీరకాంతి, ఆ యంగ సౌష్ఠవము, ఆ పలుకుల మార్దవము వానినన్నిటిని మించిన యా మంచితనము వర్ణించుటకు కాళిదాసునివంటి కవులు గావల యునుగాని తదితరులు చాలరు. మూర్తీభవించిన చక్కదనము వలెను గలియుగమునకు వచ్చిన జగన్మోహనావతారము వలెను కృష్ణకుమారి ముద్దులు మూటగట్టుచుండెను. ఆబాలిక సోయగము నా నాటి రాజులందరు విని యామెను దేవిగాబడయుట యెట్లని యువ్విళ్ళూరు చుండిరి. అందు మొదటివాడు సింధ్యా. అతడు తన కామెనిమ్మని భీమసింగునకు సందేశ మంపెను. కూతును సింధ్యా కిచ్చినపక్షమున రాణాకు మిక్కిలి లాభమైయుండును. రాణా యెంతచెడిపోయి దుస్థితిలోనున్నను స్వలాభ మావిష యములో జూచుకొనక కులగౌరవమునెంచి కుమార్తెను సింధ్యా కియ్యననెను. అనంతర మంబరు సంస్థానప్రభువగు జగత్సింగు బాలిక నిమ్మని యుదయపురమునకు దూతనంపెను. అంబరు రాజులు కులగౌరవమున మీవారు రాణాలకు నొకవన్నె దీసి పోదురు. ఏలయన మొగలాయీలకు దమ కూతులనిచ్చి పెండ్లి చేసిన మొట్టమొదటి రాజపుత్రులు వీరే వంశముమాట యటుంచి వరుని గుణములు చూచినపక్షమున నవియు దృప్తికరములు గావు. జగత్సింగు కుటిలుడు, భోగపరాయణుడు, దుర్వ్యసనా సక్తుడునని వాని కదివరకే యప్రతిష్ఠ సంభవించెను. అట్టి

యవస్థలో బుత్రికకు దగినభర్తను వెదకువాడై భీమసింగు మిక్కిలి పరితాపము నొందజొచ్చెను. ఇట్లు మూడునాలు గేండ్లు వివాహముగాక కృష్ణకుమారి విలిచెనా వయసు ముదిరినదని యెంత యధముడు నామెం జేకొనడు. షరిగియెరిగి కులహీను లకు గుణహీనులకు నీయబుద్ధి పొడమదుగదా!

ఎన్నివిధముల యోచించినను దొరికినవారిలో జగత్సింగు సంబంధమే మంచిదని తలంచి భీమసింగు వానిదూతను గౌర వించి సబహుమానముగా బంపెను. పిదప జగత్సింగును ప్రధానము చేసికొన రమ్మని యమూల్యాభరణములు వస్త్రములు నిచ్చి మంత్రి పురోహితుల నుదయపురమున కంపెను. ఆ ప్రధానమైన కొన్నినాళ్ళకు జగత్సింగుకన్న బలవంతుడు గుణములలో వానికన్న నధముడునగు మరియొక వరుడు కృష్ణ కుమారి నిమ్మని యడిగెను. అతడు మారువారు సంస్థాన ప్రభు వగు మానసింగు అన్న చనిపోవుటచే మానసింగు స్వల్ప కాలము క్రిందటనే రాణాయయ్యెను. ఈతడు కన్య నడుగుటలో నొక క్రొత్తపుంత ద్రొక్కెను. కృష్ణకుమారి యదివరకే మృతి నొందిన మానసింగు సోదరునకు వాగ్దత్తము చేయబడెనట. అందుచేత మానసింగు భీమసింగున కిట్లు వర్తమాన మంపెను. "మీరు మీ కన్యకను మాయన్నకు వాగ్దానము చేసిరి. అతడు వివాహము కాకమునుపే మృతినొందెను, మీ వాగ్దానము మారు వారు రాణాకుగాని ప్రత్యేకము మాయన్నకుగాదు. నే నిప్పుడు మారువారు రాణాగ నైతిని. కనుక మాయన్నగారి తక్కిన యాస్తి నాకు రావలయును."

ఈ వాదమునకు దోడుగ నతడు సింధ్యాతోడుగూడ సంపా దించెను. సింధ్యాకు జగత్సింగునకు వైరముండుటచే సింధ్యా వీనిపక్షమే యవలంబించి జగత్సింగుతో సంబంధ బాంధవ్య

మును మానుకొని కూతును మానసింగునకిచ్చి పెండ్లిచేయుమని రాణా భీమసింగు నాజ్ఞాపించెను. కులగౌరవము నిలుపుటకై భీమసిం గదివరకే యొకసారి సింధ్యా కోరిక నిరాకరించుటచే నిప్పుడు నట్లే వాని యాజ్ఞను తిరస్కరించెను. అట్లు చేయుటచే వాని కాపద మూడెను. సింధ్యా తన యాజ్ఞాతిరస్కారము గావించిన రాణాను దండింపదలచి తన ఫిరంగు లుదయపురము మీద బారుపెట్టి పట్టణము భస్మీపటలము చేయుటకు సన్నద్ధుడై యుండెను. అది చూచి రాణా భయపడి సింధ్యా చెప్పిన చొప్పున చేయుట కొప్పుకొనెను. జగత్సింగు సాహసుడౌటచే మారువారు రాజ్యమునకు మానసింగు గాక మరియొక వారసు డున్నవాడని విని వానిని లేవదీసి తాను వాని పక్షము బూని మానసింగును సింహాసన భ్రష్టుని జేయదలచెను. మారువారు సేనలో సగము మొదటనే యా వారసుని పక్షము జేరెను. అటు లంబరు మారు వారు సంస్థానములు పరస్పర వినాశమునకై ప్రయత్నించి యుద్ధములు చేయజొచ్చెను. మానసింగు పరాజయము నొంది సిగ్గుపడి కత్తితో బొడుచుకొని చనిపోవలయునని సమకట్టెను. కాని యాతని మిత్రులలో నొకడు వాని సాహసమునుండి తప్పించెను. ఈ జయము గలిగినతోడనే జగత్సింగు మానసింగును దరిమి చంపి యుదయపురమునకు బోయి కృష్ణ కుమారిని వివాహమాడి తన రాజధానియగు జయపురమునకు తీసికొని పోయినచో నెంతయు బాగుగ నుండియుండును, కాని యెందుచేతనో జగత్సింగు నట్లు చేయక యూరకొనుటచే మానసింగు తన రాజధానియగు జొడుపురమునకు బారిపోయి కోటలో దూరి బలపరచుకొని దృఢస్థితి గలవాడయ్యెను.

జగత్సింగు కొందరు రాజపుత్రులను సహాయము గైకొని జొడుపూరు కోటం జుట్టుముట్టి మారుముట్టడించెను. క్రమక్రమ

ముగా జగత్సింగు సేనలో నాహారపదార్థములు తక్కువగుటయు బరస్పర కలహములు జనించుటయు మొదలగు నరిష్టములు కలిగెను. ఈ కలహముచేత జాడుపూరుకోట యొకవేళ స్వాధీన మైనను మానసింగును వారు పట్టుకొనలేనంత దురవస్థకు వచ్చిరి. మానసింగు కోటలోనుండి చెక్కుచెదరక పగతుర నిరాకరింప జొచ్చె. ముట్టడించు సైనికు లొండొరులం జెరుపదలంచు చుండుటచే వారికి జయము గలుగుట యరిదియని వెల్లడియయ్యెను. అంతలో జగత్సింగుతల్లి మారువారుసైన్య మొకటి తమ సైన్యములో గొంత భాగమును దుత్తునియలుగా ఖండించి రాజధానియగు జయపురము మీదికి వచ్చుచుండెనని కొడుకునకు వర్తమాన మంపెను. జగత్సింగు విషాదమగ్నుడై మానసింగు వద్ద బట్టుకొన్న నలువది ఫిరంగులను స్వసైన్యములో జాల భాగమును దన రాజధానికి బంపదలచెను. అదివరకు మానసింగుతో గలహించి జగత్సింగు పక్షమువచ్చిన మారువారు రాజపుత్రులు జగత్సింగుచేసిన పనికి గోపించి తమ రతనితో జేసికొన్న యొడంబడికను సరకుసేయక తమ రాజుమీదగల క్రోధమును మరచిపోయి తక్షణమే మానసింగుతో జేరి జగత్సింగు భటులపైబడి తమ ఫిరంగులు తాము పుచ్చుకొనిరి.

మారువారు రాజపుత్రులు తన్ను త్యజించినతోడనే జగత్సింగు పిచ్చివాడై యెద్దియుం దోచక తన్ను సురక్షితముగ బారిపోనిమ్మని మహారాష్ట్ర సేనాపతికి లంచమిచ్చి తన పట్టపు టేనుగును సయితము యుద్ధభూమిలో విడిచి ప్రాణము లరచేత బెట్టుకొని రాజధానికి బలాయితుడయ్యెను. ఎట్లయిన నతడు సురక్షితముగ నిల్లుచేరెను. ఈ బ్రతికియుండుట యపకీర్తి నిమిత్తమేయయ్యె. అతడు ప్రాణము దక్కించుకొనెను గాని వాని సైనికు లనేకులు మార్గమధ్యమునంబడి చచ్చిరి. వారి

యెముకలు చాలకాలమువరకు జయపురము దారిలో పోగులు పోగులుగ బడి చూపరులకు భయము గొలుపుచు వచ్చెను.

ఈ విధముగ బరరాజులతో సంభవించిన యుద్ధమున మానసింగు విజయమునొంది యంతశ్శత్రువగు తన జ్ఞాతిని నిర్మూలింప బ్రయత్నించెను. ఈ కార్యమున నతనికి సింధ్యా సేనాపతియగు నమీరుఖానను మ్లేచ్ఛుడు చాల సహాయము చేసెను. ఆ తురక వాని జ్ఞాతికడకుబోయి మానసింగు పక్షము తాను మానినట్లు వానికి సహాయము జేయబూనినట్లు డియ్యని మాటలు జెప్పి వాని పక్షముననున్న గొప్ప సరదారులను తన శిబిరమునకు సంధిమాటల నిమిత్తము రమ్మని పిలిచెను. ఆ సర దారులు వాని మాటలు సత్యములుగ నగచి వాని గుడారమునకు వచ్చి యతడు చేయించిన మేజువాణి చిత్తగించుచుండిరి. అంతలో నమీరుఖాను దేరావిడిచి యావలకుబోయెను. వెంటనే గుడారము గుభాలున వారినెత్తిని గూలిపడెను. అందరు ప్రాణ వశిష్టులై గిజగిజ తన్నుకొనుచుండ మహారాష్ట్రసైనికులు వారి తలలు నరికి వెలుపలనున్న వారి సేవకులను దుపాకులతో గొట్టి చంపిరి.

ఇత్తెరంగున మానసింగు శత్రుసంహారము గావించి తన దేశము నిష్కంటకముగ జేసికొని కృష్ణకుమారిని వివాహ మాడ నిశ్చయించుకొనెను. అప్పుడు సింధ్యా "నీ కూతును మానసింగునకిచ్చి వివాహము చేసినను సరే లేక యన్యుల పాలు గాకుండ నామెను జంపినను సరే" యని భీమసింగుతో జెప్పుమని యమీరుఖాను నుదయపురమున కంపెను. కృష్ణకుమారిం దన కిమ్మని వెనుక సింధ్యా భీమసింగు వేడినప్పు డతడు నిరాకరించి నందున నాటిపగ దీర్చుకొనవలయునని సింధ్యా యిట్లుచేసెను. పాపము భీమసింగు కడుఖతిపిచే నట్టిపని యన్యాయమని

దారుణమని యెన్నివిధములనో మొరపెట్టుకొనెను. కాని ప్రయోజనము లేదయ్యె. పిమ్మట నతడు తన నమ్మిన మంత్రియగు నజితసింగును బిలిచి యాలోచన చెప్పుమనియె. దురాశాపాతకుడు దుస్స్వభావుడు దుర్నీతిపరుడు నగు నజితసింగు లంచగొండియై యమీరుఖాను వద్దనుండి కొంత ధనము స్వీకరించి యీ క్రింది విధమున దురాలోచనము చెప్పెను. "మీ వారు రాజ్యరక్షణము నిమిత్తము కృష్ణకుమారి చచ్చితీరవలయు మీరు జగత్సింగునకు గూతునిత్తురేని మానసింగు సింధ్యా ప్రముఖులతో దేశమును భస్మీపటలము చేయును. మానసింగు కిత్తురేని బలగర్వితుడగు జగత్సింగు దండువెడలి మీవారు నెత్తురువరదలు చేయును. కన్యక నెవ్వరికియ్యక యంతఃపురమున దాచుదురేని సింధ్యా మరాటి మూకలతో గోటజుట్టుముట్టి పురుషులనెల్ల గత్తికి బలియిచ్చి యాడువారిని నింతింత యనరాని పరాభవము పాలు సేయును. మన మెటులైనను మన యాడువారి గౌరవము గాపాడవలయుగదా! కాబట్టి రాజ్యము గోల్పోయి యనేకు లిడుమల బడుటకంటె రాజ్యరక్షణనిమిత్త మొక్కతె మృతి నొందుట చాల మంచిది.

అని మంత్రి చెప్పిన సహేతుకమైన యుపదేశమును విని దుఃఖముచేత మతిచెడియున్న రాణా యది లెస్సగానున్నదని యొప్పుకొనెను. కృష్ణకుమారి గతియు నిశ్చయము చేయబడెను. కాని యా బాలికను జంపుట చంపింపుమని యుపదేశముచేసినంత సులభముకాదు. రాజకన్యను రాజబంధువులే వధింపవలయును. పరపురుషు లామెయం దేదియైన జూడరాదుగదా! రాజ బంధువులలో రాతిగుండె గలయట్టి పురుషుడు దొరకవలయు. చూచి చూచి యా జగన్మోహన విగ్రహము చేతులార నెవ్వడు జంపగలడు? ఎట్టకేలకు రాణా తన బంధువులలో నొకనిం బిలిచి

యా పని చేయుమని వేడెను. అతడాపలుకులు విని గడగడ వడంక నిర్విణ్ణహృదయుడై "నేనీ ఘోరకృత్యమును జేయజాల. ఇంతకంటె నన్ను నామరూపములులేకుండ జంపివేయు"డని ప్రత్యుత్తరమిచ్చెను. పిమ్మట రాణా తనసవతితమ్మునిబిలిచి యా కృత్యము నిర్వహింపుమనియె. అతడును సాహసికుడై సరియని ఖడ్గపాణియై గంభీరముగ నంతఃపురము బ్రవేశించి నిష్కళంకమగు మనస్సుతో దేదీప్యమాన ప్రభలతో వెలయుచున్న యా లోకైకసుందరిని జూచి చంపుటకు జేతులురాక కత్తి నేల బారవైచి యేడ్చుచు నామె పాదములపయింబడి తనవచ్చిన పని జెప్పి యామెదగ్గర నిలువలేక మరల రాణావద్దకు బోయెను.

మహాపాతకహేతువై హృదయనిర్భేదకమగు నీ ఘోర కృత్యము నంతఃపురవాసు లెవ్వరు జేయజాలకపోవుటచే రాణా రాతిగుండెగలవాని నెవనినైన బయటనుండి బిలుపింపవలయునని తలంచుచుండ నంతఃపురమునందుండు నాడువాండ్రు కొందఱా కార్యము జేయుట కొప్పుకొనిరి. దానికి రాణాయును సమ్మతింప నా యాడువాండ్రును దారుణములగు కొన్ని విషములను గలిపి యొక గిన్నెలోవేసి సిద్ధముచేసిరి.

ఆ బాలికతల్లి తన ముద్దుల కూతునకు జరుగుచున్న మహోపద్రవమును గన్నులారజూచి యంతఃపురము ప్రతిధ్వను లిచ్చునట్లు దాపున నున్నవారి హృదయములు భిన్నములగునట్లు విలపించుచుండ జెలిమికత్తెలు కంటికి నేలకు నేకధారగ నేడ్చుచుండ గృష్ణకుమారియు మహాధైర్యముతో ముఖము వైవర్ణ్యము నొందకుండ భయము లేశము లేకుండ నంగము చలింపకుండ పానకము ద్రావినట్లు విసమున్ద్రావి తల్లింజూచి "యమ్మా! యేల నేడ్చెదవు? మరణమన్న నాకు భయములేదు. నేను నీ కూతురునుగానా! రాజపుత్రికలు దుఃఖింపనగునా! రాచబిడ్డకు

సాధారణముగ బలవన్మరణమే కలుగుచుండునుగదా! నన్నింత కాలము బ్రతకనిచ్చినందుకే నాతండ్రికి నేను గృతజ్ఞురాలనై యున్నా"నని జ్ఞానగర్భితములగు మాటలచేత నూరడించెను. ఆమె ధీరతత్వమునుబట్టియో పాళ్ళు సరిగా పడకపోవుటచేతనో యా విష మామెను జంపలేదట. అందుచేత మూడుసారులామెకు విషము కలిపి యివ్వవలసివచ్చెను. ఎట్టకేలకు వారు మఱియొక విషము తేనెతో గలిపియిచ్చిరి. ఆమె యది చేతబట్టుకొని చిరునవ్వు నవ్వుచు "నిదియైన నా యంతమును జూడకపోవునా?" యని త్రాగి నిర్మలముగా గన్నులుమూసి నిదురవోయెను. ఆ నిదురయే యామెకు బెద్దనిదురయయ్యె.

మంత్రియగు నజితసింగు సంతోషముతో నీ వార్త యమీరుఖానునకు జెప్పగా నతడును దారుణమగు నా కృత్యమునకు వగచికాబోలు "ఇదియా రాజపుత్రశౌర్య" మని వానిం బరిహసించెను. ఈ దుర్వార్త రాజస్థానమంతట వ్యాపించి నప్పుడు ప్రజలందరు హాహాకారములుజేసి యతిఘోరమనిరి. ఆవార్త వినినప్పుడేగాక తరువాత ననేక సంవత్సరములకుగూడ రాజబంధువులు లోకులు కృష్ణకుమారి మాట జ్ఞప్తికి వచ్చి నప్పుడు గోలుగోలున నేడ్చుచు వచ్చిరి. మందభాగ్యుడగు రాణా దుర్మంత్రి సమేతుడై నిశ్చేష్టుడై కొలువుకూటమున గూర్చుండి యంతఃపురమున జరిగినదారుణ వృత్తాంతమును వినియెను. తనకు గూతురుతోడిదే లోకమని యామెతల్లి మరల నన్నము ముట్టక నీరు ద్రావక స్వల్పకాలములోనే కృష్ణకుమారినిం గలుసుకొనెను. రాణా జీవచ్ఛవమై దారాపుత్రులం గోలుపోయి కూతు జంపించిన దురాత్ములతో గలసి బ్రతుకవలసివచ్చెను. రాణీ మరణమునుగూడ విని విలపించుచున్న రాణావద్దకు సుక్తావతుల నాయకుడగు సంగ్రాముడనువాడు వచ్చి రాజున

తండ్రియగు రాణాంగదేవునాపు పుత్రుని మరణవార్త విని కోడలు బంపిన హస్తమునుజూచి శత్రువులపై బగదీర్చుకొనవలయునని చుట్టములనెల్ల బిలిపించి మూకలం గూర్చుకొని బయలుదేరి వెనుకటి యుద్ధములో ప్రధానముగ బనిచేసిన హాగ్యానసంక్లాయను నాతని దాకెను సంక్లాకు మిక్కిలి యపాయకరమగు గాయము తగిలెను. వాని సైనికులు మూడువందల యేబదిమందిలో నిరువదియైదుగురుమాత్రమే జీవించి పారిపోయిరి. రాణాంగ దేవుడు పగతురం గసిదీర జంపి దొరకిన సొత్తెల్ల దోచుకొని జయప్రాప్తికి జాల సంతసించి హాయిగా మరల దనకోటకుం బోవుచుండెను. అంతలో నెక్కడనుండియో యిరంతుపలుని తండ్రియు మండూరు సంస్థాన ప్రభువు నగు చండుడు ప్రచండ కోపముతో వాని కడ్డమువోయి తాకెను. అప్పుడు చాలసేపు సందడికయ్యమయ్యెను. రాణాంగదేవుడు తన యనుచరుల గలిసి యుద్ధభూమి బడియె. చండుడు జయశీలుడై శత్రుసంహారము జేయగలిగినందుకు మిక్కిలి సంతసించి మండూరునకు బోయెను.

వైర మప్పటికి నంత మొందలేదు. రాణాంగదేవుని పుత్రులగు మిహిరుడు, టన్నుడు గలహాగ్నిని మరల రవులుకొల్ప నమకట్టిరి. కాని పోగల్లు సంస్థానము మిక్కిలి చిన్నదగుటచే బలవంతులు ధనవంతులు నగు మండూరు రాజులధాటి కాగలేరని వారు తెలిసికొనిరి. క్రొత్త పెండ్లికొడుకగు సోదరుని, సోదరానంతరమున జనకుని వధియించిన చండుని జెండాడక విడుచుట కిష్టములేదు. చాలని పౌరుషములకుబోయి సంస్థానము దిబ్బ చేయుట కంతకన్న నిష్టములేదు. ఎట్లైన పితృపరాభవము మాన్పుకొనవలయునని కృతనిశ్చయులై యా సోదరు లిద్దరు

తమకు పోగల్లు సంస్థానమున గల హక్కులన్నియు వదలుకొని కట్టుగుడ్డలతో ఢిల్లీకిబోయిరి. పోయి చక్రవర్తియగు కిజరుఖానును జూచి స్వమతము విడిచి తురకలై పగతుడగు చండుని మీదికి దండెత్తి పోవుటకు సేననిమ్మని వాని నాశ్రయించిరి. చక్రవర్తి కొంతసేన నిచ్చెను. ఆ బలము గూర్చుకొని వారు చండునిమీద కరుగుచుండ జసల్‌మీరు రాణాయొక్క మూడవ కొడుకగు కేలన్ వారికి దోడుసూపెను. కేలన్ మొదటినుండి పోగల్లు సంస్థాన ప్రభువులమీద నిష్టమగుటచే నతడు వారింగలిసి శత్రుసాధనము కేవలము శౌర్యముచేతనేగాక మాయోపాయము చేత గూడ చేయవలయునని టన్నునకు మిహిరునకుగూడ నుపదేశించెను. పగ దీర్చుకొనుటకే తురకలయిన యా రాజకుమారులిద్దరు వాని యుపదేశము విని యతను చెప్పినట్లు నడువ నొడంబడిరి.

అప్పుడు కేలన్ ముందు మాయోపాయమే యుపయోగింప దలచి చండునకు వినయముతో నొకజాబువ్రాసెను. ఆ జాబులోని విషయము లివి. " మన రెండు సంస్థానములకు గల నిరంతర వైరము నాకు మిక్కిలి సంతాపము గలిగించుచున్నది. మనము సంధిచేసికొని నెమ్మదిగ నుండగూడదా ? మన దండయాత్రల మూలమున సరిహద్దులలోనున్న జనులు వేగిపోవుచున్నారు. సంధికి నేనే ప్రథమప్రయత్నము జేసెదను. నా కూతును నీకిచ్చి వివాహముచేసెదను. రాజపుత్రుల కులాచారప్రకారము నీవు మాయింటికి వచ్చి కన్యను పాణిగ్రహణము చేయవలసినదే. కాని నా గృహమునకు వచ్చుటకు నీ మనసులో ననుమానముండవచ్చు. కనుక నాచారవిరుద్ధ మయిననుసరే నా పుత్రికను వివాహము నిమిత్తము మీయింటికే పంపెదను. "

ఆ లేఖలోనున్న విషయములు చండునకు మిక్కిలి గౌరవము కలిగించునవియు కేలనుకు మానహాని కలిగించునవియునై యుండెను. రాజపుత్రుడైనవాడెవ్వ డొడంబడని యంత నైచ్యమునకు కేలన్ సమ్మతించుటచే జండుడు వానిని నమ్మి వివాహమున కంగీకరించెను. వివాహము నాగూరులో జరుగుట కేర్పడెను. కేలన్ తనకుమాత్రెం దీసికొని బయలుదేరి వచ్చెను. చండుడు చుట్టములను నెచ్చెలులను స్వల్ప పరివారమును వెంటబెట్టుకొని కోటవిడిచి పెండ్లివారి నెదుర్కొనుటకు కొంతదూర మరిగెను. పెండ్లికూతురు వారిపక్షమున మును ముందు చిన్న గుఱ్ఱపుదళము బరువుతో నిండిన కొన్ని యొంటెలు వచ్చెను. దానివెనుక తలుపులు మూసిన రథము లేబదివచ్చెను. ఆ యరదములచుట్టు గొంత రక్షకసైన్యముండెను. పెండ్లివారు వచ్చిన రాకజూడ జండునకు లోలోపల ననుమానముతట్టెను. సారెకావిళ్లుగాని వెండిమంచములుగాని బంగారునగలుగాని వానికగపడలేదు. గుఱ్ఱముదళము కొంచెము సన్నాహము చేయ నారంభించెను. అదిచూచి చండుడు వెనుకకు మరలవలసినదని స్వజనమున కాజ్ఞయిచ్చెను. కాని యాజాగ్రత్త లాభకారికాలేదు.

ఏబది రథములనుండి మహాధీరు లనేకులు గుభాలు గుభాలున నేలకురికి కత్తులుదూసి చండునిమీద బడిరి. దానితో గలిసి తురకల మూకలు మరియొక ప్రక్కనుండి వానిందాకెను. చండుడు పలుకత్తుల పోటులు దిని తన కోటగుమ్మము నెదుటనే మృతినొందెను. చండుని తులువంశస్థులగు రహతూరులు వడి వడి కోటలో దూరుచుండ పగతురగు తురకలు రాజపుత్రులు గూడ వారితోగలిసి కోటలో బ్రవేశించిరి. ఢిల్లీనుంచి వచ్చిన

తురకలు పట్టణమంతయు దోచుకొన నారంభించిరి. కొందొక నేపు వారు కొల్లగొనినపిదప రెండుదెసలనున్న రాజపుత్రులు తమపూర్వ వైరములువిడిచి యొండొరులం గలిసికొని మన మందరము జీవించియుండగా మనయెదుట మహమ్మదీయులు రాజపుత్రపట్టణము దోచుకొందురా? మనకిప్పుడు విరోధము లుండవలసినపనిలేదు. రెండువైపుల దండ్రికొడుకులు మృతి నొందినారు. రెండుకుటుంబములు గౌరవములు నిలబెట్టుకొన్నవి. కాబట్టి యికముందు మైత్రిగలిగి యుందమని యభిమానపర వశులై యాదోపుడు మాన్పదలసి యిద్దరకు సామాన్యశత్రులగు తురకల దుంపద్రెంప నిశ్చయించిరి. అట్లు నిశ్చయించుకొని రహతూరులు భట్టీలుగలిసి తురకలమీదబడి దొరికినవారిని తుత్తునియలుగ ఖండించి దోపుడుధనము మరల దోచుకొని సంతుష్టహృదయులై తమతమతావులకు బోయిరి. ఈ యుద్ధమున మిక్కిలి నష్టపడినవారు రాణాంగదేవుని పుత్రులు స్వమతము విడిచి బుద్ధిపూర్వకముగ తురకలైనవారు కులభ్రష్టులయిరి. చక్రవర్తి యిచ్చిన సైన్యమును గోలుపోయిరి. మాయోపాయ విశారదుడగు కేలను పోగల్లునకుబోయి వారిరాజ్య మాక్ర మించుకొనియెను.

కేలనుకొడుకు చాచకదేవుడనువాడు, పితురనంతరము గద్దెయెక్కెను. అతడు తండ్రికన్న నేర్పరి. అతడు దుండగుడై చుట్టుప్రక్కల దేశములను బలుమారు కొల్లగొని యొకసారి సేనలతో పంజాబుదేశమున కరిగెను. అప్పుడతని కొక దారుణ రోగము సంభవించె. మంత్రములుగాని మందులుగాని పనిచేయ నందున మరణము సిద్ధమయినదని యతడెరింగెను. రోగ

పీడితుడై పాన్పుమీద బండుకొని కుళ్ళిచచ్చుట రాజపుత్రుల కవమానకరమని యభిప్రాయపడి యట్టిచావు చచ్చుట కిష్టము లేక యెవరైన నప్పుడు తనతో యుద్ధమునకు వచ్చినపక్షమున సమరమున గత్తిపోటుతిని మేను చాలింపవలయునని యుత దభిలాషనొందెను. చాచకదేవుడు యుద్ధములయందు గడతేరిన పోటుమానిసి. అతని యెదుటనిలిచి యాకాలపు వాడెవడు యుద్ధము నేయలేకయుండెను. అందుచే వానితోపోరుట కెవ్వరు దొరకరైరి.

అతనికి బూర్వకాలపు శత్రు డొకడు కలడు. ఆశత్రువు ముల్తానురాజు. చాచకదేవుడు వానిని రెండుసారులు గొప్ప యుద్ధములలో నోడించి చాలా నష్టపరచెను. అతనికి వీని పేరు గర్భనిర్భేదకమై యుండెను. చాచకదేవుడు ఖడ్గమరణమునే బడయవలయునని యుబలాటపడి యతినీచమై రాజపుత్రప్రతిష్ఠకు దగని మంచపు మరణము దనకు దప్పించి ఖడ్గమరణ మిప్పింప వలయునని బ్రతిమాలుచు దన ప్రాతపగతుడగు ముల్తానురాజు నకు వర్తమానమంపెను. ముల్తానురాజు పేరు కాలుషుడు. కాలుషు డావర్తమానమువిని నమ్మక యదియేమి దొంగయెత్తో ముల్తానుపట్టణము మూడవసారి పట్టుకొనుటకు పన్నినపన్ను గడకు కూడదాయని సందేహించెను. ఆవార్తదెచ్చిన తరువాత వాని సందేశము వారింప నిట్లనియె. "చాచకదేవుడు నిన్ను ద్రోహము జేయదలచుకొనలేదని నేను ప్రమాణముచేసి చెప్పె దను. అతడు నీచేత గౌరవమైన మరణము నొందవలయునని కోరుచున్నాడు. ఆయన యైదువందల సైనికులకంటె నెక్కువ జనమును దీసికొనిరాడు" అనవుడు ముల్తానురాజు ప్రాత

పగతునిగూర్చి జాలినొంది వాని యిష్టప్రకారము యుద్ధమునకు పోవుట కొడంబడెను. చాచకదేవు డాపలుకులువిని సంతసించి లోకవ్యవహారోన్ముఖుడై భార్యలవద్ద సెలవుగైకొని యాస్తి కొడుకులకు సమానముగ బంచిపెట్టి యన్నిచింతలుమాని స్వల్పసైన్యముతో బయలుదేరి యుద్ధమునకుబోయెను. ముల్తాను రాజుగూడ మాటదప్పక వానిని నెదుర్కొనబోయెను. అప్పుడు చాచకదేవుడు స్నానముచేసి సంధ్యవార్చి భగవంతుని బ్రార్థించి దానములుచేసి కత్తికి బూజచేసి రెండవధ్యానములేక యుద్ధమునకు పోయెను. రెండుగంటలసేపు సంకులసమరము జరిగెను. ఇరువంకల జాలమంది సైనికులు మృతినొందిరి. చాచకదేవుడు ముల్తానురాజుచే ఖడ్గమరణమునొంది తన యభీష్టము నెరవేర్చుకొనియెను.

సమాప్తం.

రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి.